శ్రీమత్పరదేవతాయై నమః.

# గీరతము.

## గురుదక్షిణ.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి

మల్లంపల్లి భైరవమూర్తిగారిచే

స్వకీయమగు

శ్రీ భైరవముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడెను.

మొదటికూర్పు 1,000 కాపీలు.

మచిలీబందరు.

దీని వెల రు 0—10—0.

1913.

# ఉపోద్ఘాతము.

చదువరులారా?

గిరతప్రథమభాగము చదివి యుంటిరికదా? సర్వవిషయములను సూత్రప్రాయముగా నందే గతార్థము లగుటచే నిప్పుడు ప్రకటించు ద్వితీయభాగమునఁ గాని ప్రకటింపఁ బోవుతృతీయభాగమునఁ గాని తెలియఁదగు విశేషాంశము లంతగా నుండవు. ఎన్నాళ్లుచదివినను నాయాయీగ్రంథభాగములయందు—

(1) శిష్యుఁడుగురుద్రోహము చేయుటతప్ప (2) అందులో నీ శిష్యుఁడు వత్సరములకొలఁది చదివినశిష్యుఁడు గాని వేఱొకవిధమగువాఁడు కాఁడు (3) పైఁగా నితఁడు కృతఘ్నుఁడగుటతోఁ జాలింపక వదరుఁబోతువ్రాఁతలు,అసత్యములు, అపవాదలు లోనగునవి ప్రకటించుట మొట్టమొదలేతప్ప

అనునీయంశములు దక్క వక్తవ్యాంశము గానరాదు. గురువే దోషియో లేక శిష్యుఁడే దోషియో మీకు మొదటిభాగమువలననే గతార్థమై యుంటచే దీనిప్రకటన మంతయావశ్యక మని మాకును దోఁచలేదు గాని మొదటిభాగమునందు విస్తరభీతిచే వదలినయంశములు కొండొక యుంటచే నయ్యవి యిందు ఖండించుమిషమీఁదగురుశిష్యధర్మములు కొన్ని సంగ్రహించి చూపుటకై దీనిని ముద్రించితిమి. "అట్టహాసము" అనునది ప్రథమభాగమందే యించుక స్పృశించి వదలఁ బడినది పిమ్మట గుంటూరిసీమ పూర్వరంగము 47, 48, 49 వ పుటలలోఁ గొండొక దాని బండారము బయట బెట్టఁ బడినది. ఇందుంగూడ నక్కడక్కడ దానిం గూర్చి ప్రస్తావింపఁ బడినది. "అట్టహాసమే యన నేల మాశిష్యులు వ్రాసెడి వ్రాఁతలెల్లఁ బరికించి చూచినచో.—

(1) మాగురువు పండితుఁడు గాఁడు. (2) పాత్రుఁడు గాఁడు.

అనునంశము సాధించుటకై పాటుపడుటదక్క వేఱొక్కటి గానరాదు. ఇందులకు వారు చూపుప్రమాణములో?, పేరు దాఁచికొని వ్రాఁచినవ్రల్లదము లెల్ల వ్యయపఱచిన తమ్ముల వ్రాఁతలు, ఆవ్రాఁతలవలననే గిరత ప్రథమభాగము నిస్సార మనియూ నిరుపయోగమనియూ కూడ లిఖించి సంతసించుచుండిరి ఆవ్రాఁతలతత్త్వము లోకమెల్ల నెఱుంగును మాశిష్యు లంతకుమున్నే యెఱుఁగుదురు, ఎటిఁ

గియున వానివలన మాకేదియో న్యూనత కలుగు ననియు నంతలోఁ దమగురు త్వముకూడఁ బోవు ననియుంగాఁబోలును వీ రవి పట్టుకొని సారెకు ప్రవేశించుట,

"శ్లో॥ కతిపయదివసైః క్షయంప్రయాయా, త్కనకగిరిః కృతవాసరావసానః, ఇతిముద ముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే. (విద్యానాథకృతము)

"తుష్యతుదుర్జన" న్యాయమున నాయీయాతప్పదువ్రాఁతలెల్ల నిజములేనై నను దమ కవి సాయము గావు, అవి మాకుఁ గలయశమును బోఁగొట్టినఁ బోఁగొట్టుఁగాక తమగురుత్వము నెట్లు పోఁగొట్ట గలవు? కావున వీరు మమ్ము దోషులను గాఁ జేయుటకు వ్రాయు వ్రాఁతలేమి యందులకై వ్యయపఱచుచున్న ద్రవ్యప్రదాతల స్వామిద్రోహమి వమ్మే గాని లాభకారిగావని వారి కిప్పటికేనిఁ దెలిసినచోఁ గొంతయుక్తముగానుండును నానాఁటికి వీరు మఱియును నట్టడవిని బడుచున్నట్లు వ్రాఁతలవలనఁ దెలియవచ్చుచున్నది మొదట గురుని కపాత్రత్వము సాధించుటకు "గాకి" యని పదరఁ దొరఁ కొనిరి,

"పక్షిణాం కాకీ చండాలీ"

అనుటవలన నది యపాత్రత్వమునకు సాధకమే, ఇటీవలనో? ఈవేంకటేశ్వరుఁడే యా వేంకటేశ్వరుఁ డని యభేదాధ్యవసాయము చేసి కొని పడఁ దిట్ట నారంభించిరి, అతివిస్తరమైందులకు. ఏదో విధమునఁ దిట్టుట వీరిముఖ్యోద్దేశము, ఏదోవిధమున నీతి గఱపుట మాముఖ్యోద్దేశము, వా రందులకును మే మిందులకును బాటుపడవలసిన దని భగవంతుఁ డేర్పఱచియుండుటచే నేవో వ్రాసికొనుచుందుము. రసారసవిచారముతో మాకుఁ బని లేదు కావునఁ జదువరులు మమ్ము నిందింపకుందురుగాక, ముందు ప్రకటింపఁబోవుభాగములలో 'తిరుపతి వెంకటేశ్వరార్థశతకమును' గూర్చిన పద్యములుండును. 78 వ పుటలోని 237 వ పద్యము వలన నీ భాగము వెలువడు నప్పటి కది మేముచూడనే లేదని తోఁచును గాని, అపుడు ముద్రిత మగునప్పటికే చూచియుండలేదు గాని యిటీవలఁ జూచితిమని యెఱుంగునది, వెంటనే కొన్నిపండితుల పద్యములతో ఖండింపఁబడినది గాని విస్తరభీతిచే నవి యిందుఁ జేర్పలేదు, దేవునితో నభేదముచేసి తిట్టుట వలన వారికిఁ బాపమున్నదో లేదో గాని దానిని ఖండించుటకుఁ జెప్పకవిత్వమువలన మాకొకింత పుణ్యముకూడఁ గలుగుచున్నదని యానందించుచున్నారము. ఇది ముందు రాఁబోవు భాగమునఁ జర్చింపఁ దగిన దగుటచే నిందు విస్త

రింపక ప్రికృత మగు 'కోకిలకాకమునుగూర్చియు, నింతకుమున్న ప్రచురించిన గీరత ప్రథమభాగముపై వారుప్రకటించిన శంకలను గూర్చియుఁ గొండొక వ్రాసి విరమించెదము. "కోకిలకాక" మన్యాపదేశముగ దా? దానిని మీపై నేల పెట్టుకొంటిరి. అని ప్రశ్నరావచ్చును, అందులకుఁ బ్రథమభాగపీఠికలో మాశిష్యుల వ్రాఁతలనే బోధకములనుగాఁ జూపి యున్నారము. ఇందుఁగూడఁ గొండొక చూపెదము.

(కవితలోని ప్రభాకరపరామర్శమునుండి)

చ॥ ...... మీగురులకుఁ దెల్లమే,...... మాగురులశక్తి... ... ఉండిరా బద్ధ
శక్తి ...... దెబ్బఁదినుకాకియె కాక నిగుంగెఱుఁగునే॥

ఈ పద్యము 47 వ పుట మొదలుకొని యుదాహరించిన వేటూరి ప్రభాకర శాస్త్రి సతీర్థ్యసంప్రార్థన పద్యముల కిచ్చిన ప్రత్యుత్తరములోనిది, అతఁడు గురువును గాకి యని వ్రాయుట తప్పని మందలించిన పైని వ్రాసినవ్రాఁతలో మరల నదే పాటపాడుచు లేదని బొంకమొదలిడిన వీరితెల్విని, వీరిదైవానుకూల్యమును జదువరులే విచారించుకొందురుగాక. ఈ బొంకులను దమపేరితోఁ బ్రకటింపక శిష్యునిపేరఁ బ్రకటించుటవలనఁ దా మతని మందలింపున కుత్తరమీలేమి స్ఫుటమగుచున్నది, ఏశిష్యపేర నీ ప్రల్లదములను వీరు ప్రచురించిరో అశిష్యుఁడే యింటివల "పాణిగృహీతా ప్రశస్తానందశృంఖల" యను పేరితో 120 పుటలకుమించిన బూతుఁగూఁతలను వ్రాసి లోకుల స్తోత్రముల కర్హమైనగుణవంతుఁడు. అతనిపేరా పాత్రముననే చూడఁదగు, అతని శంకలకుత్తరములు "శృంఖలాత్యణీకరణము" చదివిన విస్పష్టముగఁ దెలియఁగలవు అబూత లవ్రాఁత వెం॥ రా॥ లయొఱక మీఁదనే జరిగినదనుటకు సాక్షీభూతము లగునంశములు బోలెఁడుకలవు అవి గూడ నన్యత్ర చూడవలయును మఱియుఁ బ్రకృతమగు "ప్రభాకరపరామర్శ మునుండియె మఱికొన్ని యసందర్భప్రలాపములను జూపుచున్నారము

"మ॥ ... వ్రాయఁగ నాయంబె సతీర్థ్యులంచు ... కొద్దిగ. శ్రీరామ కవీంద్రుఁ డొకగ్రుడ్డెడె విద్దై నెన్నొర్చె ...యుద్వరణ బిలిచెదే,

ప్రభాకరశాస్త్రి "సతీర్థ్యులార" అని వెం॥ రా॥ ల నిరువురను బిల్చుట, తప్పఁటె? ఉతప్పిట్లు సమర్థింపఁ బడుఁగాక. ఏండ్లకొలఁది వెంకటరామయ్యశిష్యుఁడు, రెండవయతఁడో? కొన్నాళ్లు మాత్రము శిష్యుఁడు దీనింగూర్చి భారవిమహా

తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రివద్దఁ జదివిన దేదియును లేదు. అట్లే వెంకట రామయ్యకూడ నని శిష్యనిర్వాలుతోఁ బ్రకటించు మా శిష్యులసాహసమును లో కమే పరికించుఁగాక. తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రియందు గురుత్వబుద్ధిని జూపు గారణము, అతనికంటె నితఁడు ముందుగాఁ గవనము రచించు నలవా టు గల్గినవాఁడగుటచే నేకందపద్యలక్షణముగానీ దేని యొకనిమిషమందో యెత నిపలనఁ దెలిసికొనుటతప్ప వేఱుగాదు, ఇఁక వెంకటరామశాస్త్రికిఁ గల యాత ద్గురుత్వము సంతులలోనూ యొకవరకుమాత్ర మితరులధియుఁ దక్కిన దెల్ల వెంకటశాస్త్రిదియ నగుటకు భగవంతుఁడే సాక్షి కాఁగలఁడు. దీనింగూ ర్చి మూఁడవభాగములో విస్తరింపఁదలఁచి యిందు సూత్రముమాత్రమున్ని విర మింపఁబడుచున్నది. అప్రస్తుతప్రశంసలో మూఁడుమాసము లని కృష్ణకవి వ్రాసి నను, కోకిలకాకములో 'చాలఁగాలము' వినిరి, అని యిరువురచేవ్రాళ్ళతోఁ బ్రక టించి యున్నారు "చాలఁగాల" మనఁగా? మూఁడుమాసములే యని పోట్లాడు దురా? అయినచో 'స్త్రీప్రత్యయాంతము కౌముది' చదువుట పొసఁగదు, ఏకసం థబుద్ధిమంతులకు మూఁడుమాసములలోనే స్త్రీప్రత్యయాంతము కావచ్చునని వాద మునకు దిగినను నిలువదు, మూఁడుమాసములు వుత్రగూడ చేసెను, మాసము 1కి నన ధ్యాయములు 10 దినములు, అదిగాక మధ్యమధ్య నైమిత్తికములు గొన్ని యుం డును. అవియెల్లఁబోఁదోసినచో సుమారు 45 దినములు చదివినట్లు తేలును, ఆది నములలోనే స్త్రీప్రత్యయాంతము చదువుటకు వైయాకరణు లెవ్వరును నొప్పరు, పైఁగా నా నలుబదియైదు దినములేని పాఠము జరుగుటకు.—

"తా" నెవ్వఁడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచునుంట నేమియుం జెప్పఁడు కాకి కోయిలకు,, (కోకిలకాకము.)

అను వారివాక్యమొప్పి కొనదు కావున విమర్శించుచో మాశిష్యులు వ్రా యుచున్నప్పుడెల్ల నింతసారము కలది, వారియదృష్టము మంచిది, కావున వారికి గురుదూషణ, దేవదూషణ 'అనృతోక్తులు' ఇఁక్కనేమి కావలెను, కలియుగ మునకుఁ గావలసిన సామగ్రి యంతయుఁ దటస్థించినది 'దానితో' బోలెఁడు గ్రంథమును వ్రాయుచున్నారు. వ్రాయఁగలరు, ప్రతిగ్రంథమును నిట్లు విమర్శించి నిగ్గు తేల్చువారెవరు? ఎవరికిఁ గావలెను, స్థూలదృష్టిచేఁ దిలకించువారో, "కాఁ బోలును" అని యనుకొందురు, ఇది యిట్లుండె, "పరామర్శము" నుండి యొక నొకకూట ముదాహరించి దానిసారమును దెల్పి వదలుచున్నారము.

"సీ॥ పదుమీఁద నైషధాంతము కావ్యములు చెప్పి సాహిత్యయుతునిగాఁ జల్పినాఁడు"

వెంకటశాస్త్రికి శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు నైషధాంతము కావ్యములు చెప్పిరనియుఁ గవిత్వము మొదలైనవి నేర్పిరనియు వారియెడల వెంకటశాస్త్రి కృతఘ్నుఁ డయ్యెననియుఁ బై పద్యమునందలి సారము, శ్రీకృష్ణమూర్తి శాస్త్రులవారివద్ద వెంకటశాస్త్రి చేసిన విద్యాభ్యాసాదికము నీక్రింది పద్యములవలనఁ దెలిసికొనఁ గోరెదము.

(జాతకచర్యనుండి)

చ॥ కదలి యనంతరం బచోటు కాటవరంబను నొక్క పల్లె కింపొదవగనేగ...,,

కాటవరమనునది శ్రీశాస్త్రులవారి నివాసస్థానము శ్రీవారిటీవలఁ జాలకాలముక్రిందట రాజమంద్రి ప్రవేశించిరి.—

(మఱికొన్ని పద్యములు.)

తే॥ గీ॥ అచట శ్రీపాదవంశజాఁ డనఘమూర్తి, కృష్ణమూర్త్యాఖ్య సుకవివరేణ్యు నొద్ద, మొదలిడి కుమార సంభవమునను రెండు, సర్గలుపఠించె మూడు మాసముల కెలమి,,...తే॥ గీ॥ గురువుఁ దత్పాఠమియుఁ గూడికయుంచు, 'నాడుచుం డురు చదరంగ మట్టియెడల, లక్షణం బెట్టు లట్లు తల్లక్షణంబు, నితఁడు గ్రహియించె నాదరమొనక మెసఁగ....తే॥ గీ॥ అంతమేఘ సందేశకావ్యమును మొదలు, పెట్టి చదువుచు నున్నంత విఘ్నకార, ణం బుదయమందెఁ దత్ప్రరూపంబు దెలియఁ బలుకెద...,, చ॥-- గురునింటి మృతింగని వాత్మ దేహమం, దాదవె సుకించుకంత జ్వరరోగము, --- గురునికిఁ బచియించి యానమాఖ్యపురముం జనెఁ దల్లిని దండ్రినింగనన్,....

నైషధము శ్రీశాస్త్రులవారివద్దనే కాదు మఱియొకరియొద్దఁగూడ నిప్పటికిని వెంకటశాస్త్రి చదువనే లేదు ఇంక ముందు చదువవలసియుండును, అయినయట్టి కవులకు శ్రీ శాస్త్రులవారే సాక్షులు, శ్రీశాస్త్రులవారు వెంకటశాస్త్రిని కృతఘ్నుఁ డనియందురో యే మందురో 57 వ పుట. 11 వ పంక్తి లోని గాదె జగన్నాథస్వామిగారి పద్యములోఁ జూడఁ గోరెదము, గీరతప్రథమభాగమున 27 వ పుటలోని సీసపద్యమునఁగూడ శ్రీశాస్త్రులవారి విషయము కొంతకలదు. చదువఁగో

రెదము, అథవా, శ్రీశాస్త్రులవారికి వెంకటశాస్త్రి కృతజ్ఞుఁడు గాఁడు, అంతమాత్ర మునఁ దమకేమి లాభము. అతఁడే రౌరవాదినరకముల కగ్గమై పోవుఁగాక, అతనిద్రోహ నింద్య మని యెఱిఁగియు వీరేల పట్టవలెను.

'యాన్యస్మాకగ్ం సుచరితాని' తానిత్వయోపాస్యాని. నో ఇతరాణి.

అని చెప్పిన వేదవాక్య మెఱుఁగనిది, అతనిమంచిని గ్రహించినచోఁ దమ్ము లోకము మెచ్చునుగాని యెందులకుఁ బరాఙ్ముఖులై యతని చెడ్డను గ్రహించినఫలమేమి, ఇది యిటులుండుఁగాక, ఇఁక వీరిగిరతవిమర్శనపుశైలి నించుక ప్రదర్శింతము.

'గిరత' శబ్దము సాధువు కా దని కొంత చర్చ వ్రాసి దూషించిరి, అది పండితులు చేయవలసినది కాని జ్ఞానలవదుర్విదగ్ధులెల్ల దానికి నధికారులు కారు, వీరు జ్ఞానలవదుర్విదగ్ధు లనుటకు వారి "శతఘ్ని" యే మొదటిసాక్షి, ఈవిషయమును దెలిసికొనఁ గోరువారు పాశుపతమును జదువఁ గోరెదము, పాశుపతమే యక్కఱ లేదు. వీరొకకవితాపత్రికలో నెవరో మేజస్ట్రీటుగారు కాళిదాసకృతమగు "శృంగారతిలకమును" దెలిఁగించి రని వ్రాయుచు వారిపద్యములను మెచ్చుటకుఁగా మా 'రసికానందమును, దెగఁ దిట్టి మొదలిడి కొన్ని పత్రికలు దానితోడనే నించి కాలక్షేపము చేసిరి, అందెన్నో యసంగతప్రలాపములను వావిడిచిరి, దిఙ్మాత్ర ముదాహరించుచున్నారము.

ఉ॥ రాత్రి మబ్బుచేతఁ దిమిరమ్మధికమ్ముగ నుండె, వ్యాప్తి మై। నాతత
కష్టుఁడై పతిరయమ్మున నిద్దురపోయె దొంగ లీ। రాత్రి యూరుచొచ్చిరి కరమ్ము
ను బాలసుగాన నెంతయుఁ౯। భీతిలుచున్నదాన నిఁక వేగమె నిద్దురమాను
పాంథుఁడా?. (రసికానందము)

పైపద్యమును విమర్శించుచు నందు "రాత్రి" అనుపదము రెండుసార్లు వాడుట తప్పని వెక్కిరింపఁ జొచ్చిరి

(వసంతతిలకము).

ఈ బాలు నెత్తికొని యింటికిఁ జన్నెనన్నేఁ, నాబంధులందఱు మనంబున
నేమి నారే, ఈ బాలు సూర్యనిభు నిట్టుల పెట్టిపోఁ, గాబుద్ధి పుట్ట దని కన్య మనం
బులోన౯ — భారత - ఆది - ౫-౮

దీనింబట్టి యట్లు వాడుట భారతసమ్మతమని స్ఫుట మగుచున్నది. కొంత స్వల్పవిషయమును గనిపెట్టని వీరు పెద్దపెద్ద విషయములలోనికి దిగుట 'కుట్టి

కెదురలేనియమ్మ స్వర్గమున కెదురుటవంటిది. గాన వీరివిద్యావిషయక మగుశంకల కిట సుత్తరము లిచ్చుటకుఁ బ్రారంభించి కొన్నిపుటలు వమ్మొనర్పఁ దొరఁకొనెను. అదిగాక గీరతముతలనఁ దమ నెత్తినిబడు నంశములేవియూ వానిని ఖండించుకొనుటకన్న శబ్దవిచారమేమి ముఖ్యము, కృతఘ్నత్వమును గాని యసత్య తత్పరత్వమును గాని లేకుండఁ గాపాడుకొనఁ బ్రయత్నించ వలయునే కాని యా శబ్దము బాగులేదు, అంపలియుత్తరములు వ్రాసినవారు 'తి॥ వెం॥ కవులకు బంధుగులు' మఱియుం గొందఱు స్నేహితులు లోనగు నపలాపములవలన ఫలమేమి, ఒకరిద్దఱు మూగురు లేక నలుగురైదుగురు వెం॥ శాస్త్రికి బంధుగులే యగుదురు గాక వారువ్రాసినవ్రాఁతలో నున్నవిశేషమేమి? వెంకటశాస్త్రికిఁ బిచ్చియెత్తినదని యెవరేని ప్రచురము చేసినప్పుడు దానింగూర్చి క్షేమసమాచారము తెలిసికొనుటకు వ్రాయువారు బంధుగులు కాఁగూడదా? అంతమాత్రమున నందలియుత్తరములెల్ల బంధుగులవియు స్నేహితులవియు నని బొంకినఁ బోవునా? మఱికొన్ని.

“తమంతఁ దామే కల్పించినవి”

యని కూడ వ్రాయ మొదలిడిరి ఈమాట కర్థమేమైనఁ గలదా? అట్లుకల్పించినచో నయ్యెవార లూరకుండుదురా? ఈ త్రోవ కొప్పరపుఁ ద్రోవ, దీనింగూర్చి గుంటూరిసీమ, ఉత్తరరంగపీఠిక చూడఁదగు ఇట్టివే యనేకములు ప్రల్లదములందుఁ గలవు, ద్విభాష్యం పుల్లకవిగారు వీరియందభిమానముకలవారా? కారా? ఆయన వ్రాసినయుత్తరము నీగురుదక్షిణలోఁ బ్రచురించితిమి. 52 వ పుటలోఁ జూడఁదగు. ఆయనకు వీరియందుఁ గలయభిమానమును స్ఫుటీకరించుచున్నారము

(కవితాపత్రికనుండి.)

క॥ శ్రీవేదమూర్తులై తగు, శ్రీవేధుల రామకృష్ణశేఖరునకుఁ, దద్భ్రాతృఁడోలేట్యన్వయుఁ, డౌ వెంకట రామకవి సదంఘ్రిద్వయికిన్॥౧॥...మ॥ ఒకచో ముద్దులు మూటఁ గట్టు నొకచో నొయ్యారముల్ చూపు నిం, కొకచో మంజులశయ్య లందు నొకచో నుత్సాహముల్ పెంచు నిం, కొకచో నిందు నలంక్రియాదులను; ప్రాజ్ఞుల్ సంతసింపంగఁ గాం, కక రాజిల్లెడు రామకృష్ణ! విశా కళ్యాణలీలాగతుల్॥......

ఇట్లు విధేయుఁడు

ద్వి॥ పుల్లకవి, దుర్గాడ. 22-9-1910.

ఈయన కట్లు మనమేల విఱిగి పోవలెనో? రోజింపుఁడు. శా... దురుద్యమదుష్ప్రసంగాదికములు తల్లిపెనుకఁ దల్లి యనఁదగిన [illegible]తల్లిలోనగు

వారికే రుచింపనియవ్వ డితరబంధువుల కెట్లు రుచించును, ధర్మము బంధుత్వాదిక
ము ననుసరించునది కాదుగదా, ఈ పుల్లకవిగారు వెం॥రాల భావిప్రయత్నము
గూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

30-7-1913.

......తే॥ గీ॥ గిరతమ్ము విమర్శించు గిట్రియొకటి, వెలువడుచు నున్నయది దాని
వెనుకనుండి, నిజవిశేషమ్ములను గని నెగడవచ్చు...కుకవి కాండ వేదండఖం
డవిఖండనార్థ్య.

ద్వివాచ్యం పుల్లకవి,
గోదావరి, డి॥ పిఠాపురం, డి॥ దుర్గాడ.

ఇదియిటులుండె, మాశిష్యుని పెద్దతల్లు లిరువురు, వీరుకడుధర్మతత్పరురాండ్ర
ని మాబంధువులెల్ల నెఱుఁగుదురు, ఆయిరువురలో నొకరిహృదయము వ్రికృతవిష
యమున ననంతుష్ట మని కనిపెట్టఁబడినది, అందులకు సూచకమగులేఖ 86 వ
పుటలోఁ గలదు, అది వారిసౌహార్దమునే తెల్పును గాని తక్కినవిషయములను
దెల్పదు, దానింబట్టి తక్కినయంశము లెఱుఁగుదురుగాక, దానినివ్రాసినకాఁక
రపర్తి నారాయణమూర్తి మాశిష్యునికిఁ బెదతల్లి కుమారుఁ డని యెఱుఁగఁదగు,
వేఱొక పెద్దతల్లిగారి తనప్రకృతోద్యమమునకు మొదలేనమ్మతింపదు గాని అవి
షయమున నేమిట వ్రాయసాధారములు లేవు. ఆధారమే యక్కఱలేదనుఁడీ,
ఏమాత్రమేని మనస్పనునది యొకటి యుండెనేని కృతఘ్నత్వ దోషము నది
యెవ్వరినిగాని సంతసింపనీయదు కాన వారు వీరననేల, మాశిష్యుఁడు కృతఘ్నుఁ
డేయగునేని యితఁడొనర్చువనులు మనుజజన్మమెత్తినయేరికిఁగాని యసహ్యములు
గాకపోవని చెప్పసాహసించుచున్నారము. అదియటులుండె.

---

(1913 సం॥ అగస్టు 27వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)

ఆంధ్రచంపూభారతము.

ఈ గ్రంథమిపుడు కవితాపత్రికయందు ముద్రితమైనది. పిఠాపురసంస్థా
నకవు లగురామకృష్ణకవు లీగ్రంథమును సాదరంబున తమకవితలో ప్రచురించు
టచే గ్రంథోత్కృష్టత చాటుచున్నది...,, (తిరుమలవెంకటరమణకవులు).

హైవంత్తులవలన నాకవులకు వెం॥ రా॥ లయందుఁ గొండొక ప్రేమకల
దని విస్పష్టమే, వీరు మాకడకంపిన పద్యములను 58 వ పుటలో ముద్రించి యుం

టిమి, వీరికృతఘ్నతాదుల విషయమున వారికిం గలయేవము నవి పూర్తిగా వెల్లడించెడిని, సార మేమనఁగా వీరి వాక్ప్రౌఢ్యాదికమును బట్టి బంధువులేమి లోకులేమి వీరిని మందలించు తలఁపుగలవారగుచున్నారు. త్రోవలేక వారిని వీరు మాకు మిత్రులుగ నవలాపించి తమ్మాలమునఁ దమకు శత్రుత్వమును సాధింపఁ జూచుచున్నారు.

(కవికర్ణరసాయనమునుండి.)

క॥ కాకేమి తన్నుఁ దిట్టెనె? కోకిల తన్నేమి ధనము కోకొమ్మనెనే,
లోకము పగ యగు పరుసని, వాకునఁ జుట్టమగు మధురవాక్యము కలిమిన్.

మాశిష్యుల వికృతస్థితి పైపద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. మొదటఁ దా మవలంబించిన పికత్వమే కాకత్వముగాఁ బరిణమించుచున్నది. దానిని వారింప నెవరితరము? ఇతరకారణములచే శత్రువులగువా రిట్టివట్టుల నేవేని యవకతవకలు తమ్మనుగూర్చి వ్రాసినచో నవి త్రోసివేయ నగును గాని యట్టిది లవమును లేనివారు శత్రు లగుచుండఁగా వారించుట యెట్లు? ఈవిషయమును సమర్థింపఁదగు నంశములు పెక్కులున్నను దిఙ్మాత్రము సూచించి వదలితిమి. వీరికి గురుద్రోహ మనిన బెల్లమునంగాదు. ఇది మాయెడలమాత్రమే యనుకొనుచుంటి రేమో అట్లు కాదు, సార్వత్రికము, దీనిని సూచించి వదలుచున్నారము.

“భగీరథశాస్త్రులుగారు, వీరు సత్తములు,...యీయన యింజరములో నున్నప్పుడు భారద్వాజఘట్టములోని విశేషములు తెలిసికొనుటకై వెంకటరామశాస్త్రిగా రాయన యొద్దకు వెళ్లినమాట సత్యమే”

ఇది కృష్ణకవివ్రాఁత, చదువుకొనుటకు వెళ్లెనన్నచోఁ బరువు దక్కువ యని యెంచి కాఁబోలు, “విశేషములు తెలిసికొనుట”కని వ్రాసి పావఫుబండి తోల మొదలిడినాఁడు, ఒకవిశేషము మాత్రమున్నది, కృష్ణకవివ్రాఁత నాఁగఁ జాలకున్నను వెంకటరామయ్య తానుగూడ నిందుఁ జేవ్రాలు జేయకుండుటచేఁ గొండొక సంతసింప వలసి యున్నది, ఈగ్రీరతవిమర్శన ప్రకరణమేమి, అట్టహాసమేమి, కృష్ణకవిగారి వ్రాలుమాత్రమె కలది యని చదువరు లెఱిఁగియే యున్నారు, ఆయనయొద్దకు విశేషములు తెల్పుటకై వెళ్లినట్లు లిఖించినను లిఖింపఁ గలసాహసి సుఁడీ కృష్ణకవి, అతని కసత్యమువలన లవమును భీతి లేదు, ఈ యంశము శృంగభంగాదికము వలనఁ దెలిసికో వచ్చును. అతనికి దీటగువాఁడు

చర్ల చలపతి, అతఁ డతని శాపమటంది, అతనింగూర్చి వ్రాసినచో మాలేఖిని కెం తేని పనిగలుగఁ గలదు, 'యతో వాచో నివర్తంతే' శ్లో॥ కథాపితులు...అశ్రీయ సేయుతః,, ప్రకృత మనునరామః, భగీరథశాస్త్రిలవారి యొద్దఁ జదివికొన్న నం గతినొప్పికొన్నచో నావిద్యాభ్యసన కాలము ప్లవంగ సంవత్సరముగుటచేఁ దద నంతర భావియగు కీలక వత్సరములోనే వ్రాసికొన మొదలిడిన

ఉభయశాస్త్ర ప్రవీణత్వము,

ప్రతుకదు, ఇందునుగూర్చి గీగత ప్రథమభాగపీఠిక ౧౮ వ పుటలోఁ గొన్ని పంక్తులు చదువఁగోరెదము, దానిని ప్రతికింప వలయునని భగీరథశాస్త్రులవారి శిష్యత్వమును బృహచ్ఛకత్వముగా మాకృష్ణసుకవియవలాపింపఁ జూచ్చెను, తన శాపమటంది యగు చర్లచలపతి పెద్ద పండితుఁడని లోకమునకుఁ దెలియునట్లే కృష్ణశాస్త్రి కొండొక యవలపించెను. ఆసోదెవలననితనికిఁ బ్రయోజన మెంత యున్నది."శృంగ భంగ" "నత్యసందేశముల" కవిత్వము తనదికాదని లోకము విశ్వసించుటయే దానికి ఫలము, ఎన్నియని చూపుదుము. ఇతఁ డసత్యమునకుఁ బుట్టినిల్లు. భగవంతుఁడును, దజ్జులును, ఇందులకు సాక్షులు, ఆచలపతి వ్రాఁత కీతఁ డిట్లు వ్యాఖ్యాన మొనర్చుచున్నాఁడు.

"వెంకటశాస్త్రిగారి బండారమంతో కృష్ణకవి తేల్చెననియు, నాపిదపఁ దిరుపతిశాస్త్రి వెంకటరామశాస్త్రులుగార్ల సంగతి చూచుకోవచ్చుననియు నందు గల యర్థము యథార్థమని ముమ్మాటికి వారు విశ్వసింతురుగాక."

("రాను రప్పింపఁ బనిగాన రాదు మాకు")

అను నప్రస్తుత ప్రశంసావాక్యము నెఱుఁగనిలోకులు దప్ప నీవ్యర్థారా పము నెవ్వరు విశ్వసింతురో.

ఉ॥ వేదుల రామకృష్ణులఁట? వెంకననంట? జయించునంట? యెం, దోః?
చరితంపుబండి నొగిఁ దోలెడిసాహసమందు; నింక నెం, దోః దుడు కందివ్రా
సి పయిఁ దోఁచక మి న్ననుటందు, నింకనెం, దోః దెలియంగరాద యది
యొక్క-టియే నథ తేల్చఁగా వలెఁ"

అది యటు లుండె,పాపము? ఆచలపతి *క్షమావణప్రాసికొని నిర్దోషి యగు గుటకుఁ బ్రయత్నింపఁగా మరల నాతని నితఁడు దోషదూషితుని జేయఁజూ చ్చెను జూచితిరా?

---

* క్షమావణ, ఇది నిందద్యగ్రాహ్యమని వెం॥ రా॥ లశతఘ్ని. శ్లో॥ క్షమా

"చర్ల వెంకటాచలపతి శాస్త్రి, యను నతఁడు నాకు బావమఱఁదియే, ఇ. యితఁడు వ్రాసినట్లుగా వెం॥ శాస్త్రిగారి ప్రోత్సాహముచే నెచ్చటి విద్యార్థులలో నెవ్వరో వ్రాసిరి"

వెంకటశాస్త్రిగారి ప్రోత్సాహ మఁటే? దానిపై నచటివిద్యార్థు లెవరో వ్రాసిరఁటే? ('కృష్ణశాదనాద్దన్రుభంగః') అన్నట్లు వ్రాయు నితనిఁ దబ్బాలు చెండలింప నుండుట కదు నయశస్కరము, తక్కినయసత్యములును విగల్పము లును నటులుంతము, ఈ విషయము నేని ధ్రువపఱచుటకు నితఁడు నత్సభలో మా యొకటికి రాఁగలఁడేమో మా చదువరు లడిగి తెలిసి కొందురు గాక యని హెచ్చరించుచున్నారము. అక్షమాపణ చలపతి పేరితో నితరులే వ్రాసినచో వారిని శిక్షింపఁ జేయుట యుక్తముకదా? నేఁడు చలపతి పేర నిట్లు సృష్టించినవారు మఱి యొకప్పుడు రామకృష్ణులపేరనే వేఱొక క్షమాపణను గాని, నోటును గాని మఱి యొకటి గాని సృష్టింప వచ్చునుగదా? కావున నిట్టివట్టుల నౌదాసీన్య ముచితము కాదని కృష్ణకవికిఁ దెలుపుదురని చదువరులను మఱిమఱి హెచ్చరించుచున్నా రము. ఇట్లే 'ముఖమస్తీతి వక్తవ్యముగాఁ గొంత సోద వెళ్లఁబెట్టెను, దానినెల్ల నూఁచకోఁతగా ఖండించినఁ బ్రయోజనము లేమి నింక విస్తరింప మైతిమి,

"అట్టియుత్తరములు మాయొద్దఁ గోటానకోట్లు గలవు".

ఎట్టియుత్తరములు? గీరతములో, తి॥ వెం॥ కవులు ప్రచురించినట్టి యుత్త రములవంటివి, ఎన్నియున్నవి? కోటానకోట్లు? పదులుగావు, వందలుగావు, వేలు నుంగావు, లక్షలునుగావు. కోట్లును గావు, ఇఁక నెన్ని? కోటానకోట్లు? అబద్ధ మాడినను నింతబట్టబయలుగా నాడవలయును గాఁబోలు; పోలు? పోలు? కోటాన కోట్లనుఁగాక, అర్బుదములనుఁగాక, కృతఘ్నత్వము సుగుణమని వ్రాయు పెద్దమా నిసు లేడదొరకుదురో? ఆ యంశమును బోధింపని యుత్తరము లేమి పనిచేయును? లేదా, శిష్యత్వము నేని యాయుత్తరము లపలాపింపవలెను, ఈ రెంటికిని ద క్కినయంశముల నెన్నిటిని నానిపలన సాధించినను ప్రకృతమున కవి లవ

---

పణ్డితవదనా॥ వదరో॥ తతఃకిమ్॥ యే (రసగంగాధరము) ఇందులకుఁ బ్రామాణ్యము కూడఁ జూఁపదగు, ఆయీనమర్థన మెల్ల "గుజినీపత్రిక"ములలోని పాతపాటులవ లన నైనట్లు వారిడుచు మాశిష్యులను నభాస్థానమునకు రప్పించుచూ 'తికాఁల ముర్ఖన లేకుండుట కదు విచార్యము అప్పుడుగదానిగ్గుతేలును.

మును సమరయోగింతమని యేమి వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు, ప్రధానవిషయ మును వదలికొని యప్రధానవిషయములకుఁ బాటుపడు వీరిప్రచారమువలన నీక్రిందిలోకోక్తి స్మృతికివచ్చుచున్నది.

“జగతి శిరశ్ఛేదనమయమందునఁ దనకుండలమ్ములయాన గొనెననంగ”

(యామినీపూర్ణతిలక.)

వీరు ప్రచురించునుత్తరముల స్వరూప మొక్కింత చవి చూపి విమర్శించుట ప్రస్తుతము కాక పోదు గాన దిఙ్మాత్ర మట్లొనరించుచున్నారము.

(కవితాపత్రికలోని యొక యుత్తరము నుండి.)

(1) “...రసికత్వలోపమునకు జడిసి మానముల బెంచి కవిత్వమున మాపరాక్రమమునకుగా నుంచితి మన్న నెవరు సహింతురు...”

ఇతరులు సహింపకుండురుగాక, దానికిఁ దగినఫలముంగూడఁ గాంతురుగాక, శిష్యపరమాణువులు సైఁప కుండుట తప్పగదా? అంత రుచింపనిచో లోలోఁ బరితపింపవలెఁ గాని.

“మీనమ్మల్ పొలివెట్టి”

అని సత్సభలలో వెక్కిరింపు మని యవివేకి బోధించునా? సైఁగా నెవరో కొంటెతనముగా వ్రాసిన “రసికత్వలోపమునకు” ఇత్యాదియొకసెక్కెఱు మాటలను శిష్యులు ప్రచురించుట తప్పుగా దని చెప్పవా రెవరు, ఇంతకు నిద్దానివలనఁ దమకృతఘ్నత యేమి నివర్తించినది.

(2)“మీ చింకను గొంతకాల మోపిక పెట్టిన లోకము మి మ్మాధునిక కవిసార్వభౌము లని యభినందించును”

ఆహాఁ! తక్కన్న నీ ప్రాఁత యుక్తి మన వచ్చును, ప్రసిద్ధులెల్లరు క్రమక్రమముగా గతించిన పిదప వీరినే యట్లు గ్గౌరవింపఁ దీర్ఘకాలము రావచ్చును “దాట్టేఁడు ... దొంగలు దోలుకొనిపోతే...గొడ్డు ...శ్రీమహాలక్ష్మి” యనునుగదా, ఆధునికకవిసార్వభౌమత్వమునకు మొట్టమొదట వీరొనర్పవలసినప్రయత్నము గురుద్రోహమే యగునేటులు? అందులకై యీపూనిక, బాగుబాగుగ, 1, 2, అంకెలు గుఱుతుగాఁ గల వాక్యములకు స్థానభూతమగు నుత్తరమొక్కటియే గాని,

అదివ్రాసినవారు మాత్ర మిరువురు, అందులో నొకరు వ్రాలుతుదను 'గారు' అని తగుల్చుకొన్నారు, అదికూడ మామీనముతలెనే యొందులకో తగుల్చుకొనిన ట్లూహింపవలసినదే, ఇంతటితెల్వితేటలు గలవా రేమి వ్రాసినను వ్రాయుదురు, అట్టివారిపేరుల నిందేల ప్రచురింపవలెను. వలయువా రన్యత్రి చూడఁగల రని యుపేక్షించితిమి.

(3) ''గిరతము నేతిబీరకాయగా భావించుకాలము రాకపోదు.

ఈవాక్యముకూడ, ఆ॥ ''గారి'' గారిదే, వీరభోగవసంతరాయఁడు పుట్టఁగలఁ డనిచెప్పనట్టియవ భవిష్యద్వృత్తాంతమును దెల్పి రామకృష్ణుల సౌహార్ద్ర పరామర్శించుచున్నట్లు వాక్యముల శైలి చెప్పుచున్నది, పరామర్శించువా రెంతో యాప్తులుగ నుండవలయును. కావున మా వెం॥ రా॥ లిట్టివారియుత్తరములను ప్రకటించుకొనుట స్వవచోవ్యాఘాత మని చెప్పక తప్పక వచ్చినది, మఱియు నింకెవరో మాకాప్తులుగా నుండువారే యొకసందర్భమున.

''పిచ్చిపుల్లయ్య''

అని వెం॥రా॥లకు వ్రాసిరఁట ? ఆ వ్రాఁత యితరోద్దిష్టమైనను నయ్యది యెట్లో మాలో నొకరికి సందర్భించునఁట? దానింబట్టి వీరి కేమి ఫలము కల్గెనో కాని యా సోదె కొంత వెళ్లఁబెట్టిరి' అయినాయనుపయోగ పరితాపముల్ల నేసందర్భమునందలి దనుకొంటిరి? మా 'పాశుపతమును, ఖండింపఁ బోవుటకు వ్రాయనుపోద్ఘాతము లోనిది, శాస్త్రము నుపయోగించుటకు వీలులేనియప్పుడు తా మింతకన్నఁ జేయవలసిన గత్యంతర ముండఁ బో దని యాసోదెకుఁ దాత్పర్య మనునది యావదర్థము, ఏపిచ్చిపుల్లయ్యయో యెదియో వ్రాసెను, దానిని ఖండించుట యుక్తమో? ఎవరో ''పిచ్చిపుల్లయ్య'' అనిరి గాన మేమును 'పిచ్చిపుల్లయ్య' అనియందుమనునది యుక్తమో విజ్ఞులకు నొకరు తెల్పవలసి యుండునా?, అదియటులుండె, వెం॥ రా॥ లు, దమయజ్ఞతను నిరసించువారి నెల్ల నేసంబంధము లేకున్నను మాకు మిత్రులనుగా నపిలపించుచుఁ దమకు శత్రువులుగా భావించుచున్నా రని యింతకు [illegible]దే ప్రసంగించి యుంటిమి, అందులకిఁక నొకయుత్తర మువాహరింపఁబడుచున్నది.

''వెం॥ రా॥ కవులు మేము అశ్వమేధమున పద్యములు ప్రకటించితి మను నరభిప్రాయముతో కవితాపత్రిక వెనుకటివలె రు 1—0—0 కి తంప మనియు

పూర్తి వెలకు గాని వంద వీలు కాదనియు వ్రాయించిరి. యింతకన్న మమ్ము వీరేవిధమున సాధింపఁగలరో...”  •  .శేషాద్రిరమణులు (సోదరులు)

తమయకృత్యముకతమునఁ దమవలని లాభమునుగూడ గణింపక తమమిత్రులు తమకు శత్రులగుచున్నారనుసంశమున కింతకన్న దృష్టాంత మేమి కావలయును? ఎవరో——

“భంగుమేడుత్తూరులు”

తప్పునుజనులెల్లరుఁ దమయకృత్యమున కేవగించుకొనువారేకద, 61 వపుట 25 వ పంక్తిలోని చామర్తి జగ్గారావు తమకెట్టిబంధుఁడు, అతనికిగీరతమునందానక్తి యుండుటకుఁ గారణమేమి, పైఁగా నితఁడు, వెం॥ రాలకు, సహాధ్యాయి, బ్రి॥ శ్రీ॥ మధునాపంతుల సూరయ్యగారివద్ద వీరు మాగురుసు గాళిదాసత్రయమువఱకో, అంతకొకింత తక్కువగనో చదివినవారలు, అట్టిచో నతఁడు గీరతమునఖిలషించుట కర్థమేమి? అంతకన్న నెక్కుడుగ వారియాత్మబంధువులేమి వ్రాయఁ గలరు,64 వ పుటలోని15 వ పంక్తిలోని ఆకొండి సుబ్రహ్మణ్యముగా రెంతమర్యాద కలవారు,ఆయన మాశిష్యుని పెదతల్లికుమారుఁడగు బ్రి॥శ్రీ ఆకొండిరామమూర్తిగారికిఁ బినతండ్రి, అట్టివారెల్ల మాగీరత కావ్యము నేలయాదరింతురో?,63వ పుట 24వ పంక్తిలోని, ఆకొండివెంకటశాస్త్రిగారు, దూరదేశస్థులు, మాయుభయులకునుశాఖామాత్ర బంధువులే కాఁదగువారు, బాగుగవిచారించినచో శ్రీఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులవారికి దూరపుజ్ఞాతులేని కాఁదగువారు, వారినిబట్టి వెం॥ రా॥ లకే బాంధవ్య మెక్కుడనక తప్పదు, వారు మా ‘గీరతము’ నందేల ప్రేమ చూపవలయునో?, ఇట్టివారికెల్ల నేదో ‘పక్షపాతిపదమునో’ మూర్ఖపదమునో, నివేదించి తమమార్గమును దాము వదలక మాకుఁ బనికల్పించు మాశిష్యుల నెవరు సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలుగుదురోకదా, వీరెల్లరును మాయొద్దఁ బుస్తకములు వెలలేకుండ సంగ్రహించుట కట్టువ్రాయుచున్నవారలఁట? ఆమాటకే యొప్పికొందము, తమవద్ద నట్టిలాభమును బొందువారుకూడఁ దమమార్గము నేల నిందింపవలెనో? నరములేనినాలుక యిచ్చవచ్చినట్లుదిరుగును, అంతియ కాని ప్రాజ్ఞులగువారు కూలికి విసమెన్నఁడును వ్రాగరు, అందులో నొకపుస్తక మూరకవచ్చునంతలోఁ గలుగు ఫలమెంతటిది, అదిగాక

వెం॥రా॥ ల, గీరతవిమర్శనమునకుఁ గృష్ణాపత్రిక చూడఁదగు.

'అపుస్తకమని "మరక్రియూరి పింఢి"గాని రసవత్తరమైనది కూడఁ గాదుగదా, అట్టిపాడు కాగితపు చెత్తకట్ట కాసించి మహాప్రాజ్ఞులుగాని తమ్మును గర్హించి మమ్ము నర్హించుచున్నారని వ్రాయుట స్వవచో వ్యాఘాతము కాక మఱేమి, దాని తత్త్వమిది. ఎవరుగాని పాపకార్యమునకు ననుమోదకులుగా నుండవలదు, పుణ్యకార్యమునకో? నిస్సంశయముగాఁ దోడ్పడుదురు; ఇందు లాభాలాభముల కించిత్కరములు, అదిగాక, స్వల్పలాభములతోఁ బనియేమి, వారలకు మహాలాభమొకటికలదు, అది పుణ్యపాపసంపాదన రూపము, దేనిని గోరువారు దానికనుమోదకు లగుచుందురు.

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః,

ఇంతతో నీవిషయము ముగించి విషయాంతర ముపక్రమింతము. చదువరులారా! వీరి "కోకిలకాకము" పుస్తకమున వ్రాసిన పద్యములకుఁ బరిమితియే లేదు. కాని నానాఁటికి వీరి గోలనుండి విరమింపవలెనని యూహాపోహముట వల్లను, సత్యమిదిపలుకే ప్రాజ్ఞలోకమునకు విస్పష్టమగునట్లు వారి వారి లేఖల వలన మా మదికిఁ బూర్తిగా నచ్చుటవల్లను, జాలపద్యములను దిగవిడిచితిమి, అందుఁ గొన్ని మచ్చుచూపుచున్నారము.

చ॥ "గరునగునే పికస్వరపికస్వర మంటివి, కారిదార్భట
భర భరితాంతరంబగు నభస్సు "గుభాలు గుభాల్ గుభాలు" మం
చుఱుముఁగ విద్యుదుద్యదను లుల్లసిలం గరుసానుఁ? సారెకుఁ
బిరునగుసూఁ? పికధ్వని కపిధ్వనియై తలక్రిందు లాడుసూఁ?"

శా॥ గాంభీర్యంబది ఘనస్వయంబుఁ దెలిపెఁ గాకి పికత్వ, మ్మ్రదే
వంభం, బెకరుడనేర్పు లీయనృతవాక్తత్త్వంబె? బెదండిచ్చెఁ? నీ
యంభోవాహవిహారఘోరవిభులవ్యాహార బాహుళ్య ది
ఙ్కుంభి శ్రీపతి ఘీంకృతుల్ వినియు మీ "కోకో" ధ్వనుల్ నిల్పునే.

మ॥ నభలో లేవడు బావకున్ గళము, తత్పూర్వనంబు మూర్ఖాన్త మే
ప్రభవై లేచినవెంటనే తపులు దుర్వారం బతధ్వాన దూ
రభవం, బయ్యది నిల్వ వీయడు ఘుమీఁ? ప్రాక్షశ్రీవోసిక్త సా
రభ సౌభాగ్య తరంతరాగ్రిమణి మూర్తి స్వైర సంచారులన్,

# XVII

క॥ కష్మ్మనఁగ శిరము, కుకవుల కష్మనియును గొండమూరి ''అకళియనఁ గొ
టిల్యమ్మదరు గరి యగుటా ది, ద్దిమ్మని కుకవితలదిమ్ము దింపుట తేలెఁ.

---

కవిత్వపుఁ బోలికను నుదాహరించితిమి కాని పైపద్యములందు నూతనాంశము లెవ్వియు లేవు. మాశిష్యులను కృతఘ్నతాఘము నుండి తప్పింతమనియు, దానివలన నితరులట్టి త్రోవ తప్పని తెలిసికొందురనియు, మేం మీపనికిఁ బూనితిమి కాని క్రమముగా వారది బలపఱచుకొనుచుంటచే నింతవఱకు మాపరిశ్రమము సాఫల్యమే కనఁబడదు, వీరివిషయమున నింక నొక రహస్యము తెలిసికొన వలసియున్నది, వీరికిఁ బెద్దమంచిగను, మంచి చెడ్డగను గోచరించుచున్నట్లు మఱికొన్ని వీరి వ్రాఁతలు బోధించుచున్నవి, వీరికి వ్యాసకృతభారతము తప్పు, ధర్మరాజ పాపుఁడు, దుర్యోధనాదులు పుణ్యాత్ములు, ఈ యంశము వీరువ్రాసిరించిన "కౌరవ గౌరవము" లోఁ జూడఁదగు ఈ విపరీతజ్ఞానమే వీరు సర్వత్ర వినియోగింపఁదగువారు, దానిచేఁ గృతజ్ఞుఁడు మహాపాపాత్ముఁడుగను గృతఘ్నుఁడు మహాపుణ్యాత్ముఁడుగను గోచరింపక తప్పదు, వీరికీవిషయము ప్రకృతముగను ముఖ్యము, కావున వీరు భారతమును వదలుకొనక తప్పదు. అది గురువును నిందించుట కొప్పదు.

(మహాభారతశాంతి పర్వమునుండి.)

భీష్మః॥ శ్లో॥ మాతా పిత్రో ర్గురూణాంచ పూజా బహుమతా మమ,... గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః, ఉభౌహి మాతా పితరౌ జన్మన్యేవోపయుజ్యతః,... ఆచార్యశిష్టా యాజాతి స్సాదివ్యాసాఽజరాఽమరా॥ శ్లో॥ వీథ్యాం ప్రత్యాప్య యే గుర్వుం నాద్రియంతే, ప్రత్యాసన్నా మనసా కర్మణావా, తేషాం పాపం భ్రూణహత్యా విశిష్టం, నాఽన్యస్తేభ్యః పాపకృదస్తిలోకే,... శ్లో॥ మాతృతః పితృతశ్చైవ తస్మాత్ పూజ్యతమో గురుః,... శ్లో॥ మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య గురుఘాతినః, చతుర్ణాం వయ మేతేషాం నిష్కృతిం నానుశుశ్రుమ.

(విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః)

గురుశిష్య ధర్మబోధకము లగు మఱికొన్ని శ్లోకములు 32, 80, 81, 82, 83, 84; పుటలయం దుదాహరింపఁబడి యున్నవి, ప్రకృతము మాశిష్య లతలం

బించినది గురుద్రోహయజ్ఞ దీక్ష, దానికి వ్యతిరేక మగుధర్మమును. బోధించునది వ్యాసభారతము.

"భారతః పంచమో వేదః"

అని దానిని పూర్వ ప్రాజ్ఞులేమి నవీనవిజ్ఞులేమి శిరసావహింతురు గాక, ఇతరపంచమవేదములయం దభిరుచి నించి తిరుపతి వెంకటేశ్వరాది దేవగురు నిందల నొనరించు వీరి కాపంచమవేద మెట్లు ప్రమాణము కాఁగలదు, కావున నే వారిప్రవృత్తి కనుకూలముగా వేఱొక భారతమును మాశిష్యులు వ్రాసికొనఁ దలఁచిరి.

ఉ॥ వ్రాయఁగ వచ్చువ్యాసముని వర్యుఁడు వ్రాసినయట్టి భారతా, మ్నాయ ములోనియంశములు మాటిచికూరిచి వేఱెభారతా, మ్నాయము ... నమ్మరు గాక, పండితుల్" (ఆంధ్రభాషా పరిషత్పత్రికలోని కౌరవగౌరవము చూ.)

ఇంతకు మున్ను "శుకగ్రహమూతిపిండె', అని మాగీరతము నే వీరు సూచించి నట్లు ప్రథమభాగపీఠికయందుఁ జూపితిమి, ఇప్పటికి వీరికి భారతముగూడ నట్టిదశ కే వచ్చినది, ఇంతతో నేమయ్యె, ఇంకను వీరిచర్యలు వీరివ్రాఁతలు ముందు చూడ వలసి యున్నది, పండితులు నమ్మరఁటని కాని లేకున్నచోఁ దలక్రిందు సంగతులతో వీరు వేఱొక భారతము వ్రాయుదురంటని.

శ్లో॥ ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం,,

అని కాళిదాసంతమహాకవి వాక్రుచ్చినది వీరికిఁ దృణప్రాయమే, ఏగ్రంథ ముగాని పండితులమెప్పునకును, అపండితుల తిప్పునకును, నాస్పదముగా నుండఁ దగు. ఆయీయంశము ప్రథమభాగ పీఠికలోఁ గొండొక వివరించితిమి, ఇఁక న స్మచ్ఛిష్యావజ్ఞకమగు కృతఘ్న మతమున కనుకూలించు నొకవ్రాఁతయు దానికి మారకమగు నింకొకవ్రాఁతయు నుదాహరించుచున్నారము.

"ఈ కాలమున నందొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వమైనది, అతిశ్లే యామ్నాయము లైనవి, భారతామ్నాయములతోఁ దుల్యములఁటని, మూర్ఖులు వా నినే యాసక్తితోఁ బఠించుచున్నారు.

ఇటువంటివా రిట్లే వ్రాయుట యుక్తము, ఇతఁడు లేశమును నపూర్వదయుఁ డు గాఁ డనుట కాఘట్టనందలివే యీక్రిందిపంక్తు లుపోద్బలకములు.

"......ఈవాక్యములు కాదంబరిలోనివి,...ఇవ్విధమున సందర్భము లేనియుప మలయొక్కయు, శబ్దశ్లేషలయొక్కయు, జాబితాలు కొండవీటి చేంతాళ్లవలె ...నొప్పారు కాదంబర్యాదులు..."

---

కాదంబర్యాదులే నీరసగ్రంథము లని తలపోయు జ్ఞానలవదుర్విదగ్ధులకు మాగ్రంథము లేల రుచింపవలెను? రుచింపనక్కఱలేదు. అది యటులుండె, సహృదయులిట్లు శ్లాఘించుచున్నారు.

(సుదర్శనీపత్రికనుండి,)

"భారతమహాకావ్యములోఁ గాని యిట్టివల గుంటూరిసీమలోఁ గాని యొక్క పద్యమునకు, ఈచదువరి మున్నుగువారి యుపనిషదుపన్యాసములు తుదకు "అసారాదితోస్త్రబహ్మ" చేయించుటకైనఁ బనికిరావు, మొదటిలో నేమాత్రపుగ్రహణపునిర లున్నను, సహనబుద్ధి యున్నను, భారతకావ్యము లోని శాంతిపర్వములో నొక్కపద్యముఁ జదివి భారతభూమిక్తిసౌధ మెక్కి తరించఁగలరు, లేనిచో సన్నిపాతరోగికిఁ జక్కెర యుఁ జేదే, యెవ్వరేమి చేయఁగలరు?

వా రట్లు నిందించుటకు హేతు వేదో గాని వీ రిట్లభినందించుటకు హేతు విది, భారతము సకలసుకవిజనవినుత మేల యయ్యె, కేవలకవిత్వ ధర్మమును బట్టియా? కాదు, దీనిం గూర్చి వ్రాసినచో నింతట నంతటఁ దేలదు, భారతమునఁ బ్రధానరసమేదియో, తెల్పుఁడన నీనాఁ డెందఱో చేతులనలువవలసినవారు కలరు, స్థూలదృష్టికి నందు వీరరస మేమో ముఖ్యమని తోఁచను వచ్చును, అది యట్టిదియే యగుచో దానికి నేతాదృశగౌరవము రాదు అందలి ప్రధానరసము శాంతము, ఈయంశమునకు,

"...భారతే శాంతిః, రామాయణే కరుణ, ఇతి, ఏవం రసాదిధ్వనయ ష్షడ్విధాః॥

అను సాహిత్యకౌముదియు, మఱియు ధ్వన్యాలోకమును ప్రమాణములు, అట్లు కొన్నిపట్టుల వివాదప్రధానముగా స్థూలబుద్ధులకుఁ బొడకట్టినను, మాభారతముకూడ శాంతరసప్రధాన మనుట నిర్వివాదము, కావుననే యిది ప్రాజ్ఞులను ఱికిం పాత్ర మైనది. తదితరులు విద్వల్లోకమునకు సహజశత్రువులు.

(1) శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః" (భారతము.)

(2) శ్లో॥...బుధజన ఇవ గ్రామ్యవదనే, (కాళిదాసః)

ప్రకృత మనుసరింతుదము. మాధ్వులను సన్మతబ్రాహ్మణగీతయే కాక వ్యాసకృతభారతముగూడ గర్హ్య మనుచున్న దనునది ప్రక్షిప్తాంశము, వీరి కెవరో కొందరు అనుయాయులుగూడ నుండుట సహజమే, ఏమతమైని యొకరితో నుండుట యెవరును గని వినినది కాదుగదా? అది యటులుండె, వీరిమతమున దుర్యోధనుఁ డెట్టివాఁడో? కదు యోగ్యుఁడు.

ఉ॥ ... దుర్యోధనుఁడా...కలియంశమున్ననఁ బుట్టినాఁ డనుచు ప్రకాశించఁగాఁ జెల్లునే, (కౌరవ గౌరవము)

ఇట్టివిమధయోగ్యుఁ డగుదుర్యోధనునితో నీ కౌరవుల దమమతమునఁ గేవలా కారుఁ డగునొక్కని కభేదము చేసి ప్రకృతసందర్భమునందే కొంత నిందించి యున్నారు, దాని కర్థమేమో? నీ రహాక్షుఁడనుకొనుచున్న మానిని నిషధయోగ్యుఁడు కావలెనని చెప్పుచున్నదే?, లేదా దుర్యోధనుఁ డహాక్షుఁడగుటను, విమర్శించుచో వీరితత్త్వము సాక్ష్యపు ప్రాంతలెల్ల నింతటిసారము కలదియేగద, వీరికిఁ దామొనరించిన గురుద్రోహాపరాధమును సమర్థించుకొనుట కీతత్త్వమూలో విలాశశ్యకము లగుచున్నవి, కాని మొట్టమొదట వీరిమత మెట్టిది? ప్రాచీనార్య సమ్మతమైనదియే, దానిని ఋజువుచేయుట యెట్లు? ఇట్లు.

శ్రీశాంకరైర్వనుః

(అసలుకు సరియైన నకలు)

చ॥ కులము త్యజించి శాస్త్రములకున్ బ్రతికూలత సంఘటించి యు
న్న్యలధనముల్ హరించుటకు న్యాయాలఁ జేయుచు పొట్టకూటి వి
ద్యలఁ గని నాస్తికత్వమును, తంబున సంచరణంబుఁ జేయు వా
రలదరిఁ జేరఁబోకుము వ, రాకున నైనను మూఢచిత్తమా. ౧

ఉ॥ యాచకపాలి కొక్కరత్నము, మైన సొసంగక యుంటిమూలలో
దాచి వృథావ్యయానము తె, దఁగన బోక ధనంబటన్నచో
కాపముతో దురాత్మ సముదాగాఁ గనుఁగొంటిరొ మేలు, దుష్ప్రతో
బాధిక వృల్లమౌనఁ గొనిపోదువె చెప్పుము మూఢచిత్తమా. ౨

ఉ॥ విత్తము వెంట రాదుసుమి, చేసినతప్పు మీ భవంబు పె
న్నత్తులఁ బోదుమీ నిజము, గాఁ దలపోయుమి యిప్పుడున్న సం

# XXI

పత్తులిటుండఁ బోవు సుమీ; పాపము నొందెదు సుమ్మి పైన నీ
చిత్తము చేతనైనటులఁ, జెప్పితి నించుక మూఢచిత్తమా. ౩

ది 27-6-03 సం॥రం.

ఓలేటి వెంకటరామయ్య.

పైపద్యములు మాశిష్యుఁడు మాకడఁ జదువుమానుకొనఁ బోవు దినములలో రచించినవి, అందులకందుఁగల తేదీప్రమాణము ఆతేదీ శోభకృత్సం,, ఆషాఢ శుద్ధ తృతీయా శనివారమునకు సరిపడును, ఆసం॥ జ్యేష్ఠములో వెంకటశాస్త్రి యింట యింజరములో నూతనగృహప్రవేశము, అంతవఱకితఁడు శ్రద్ధగాఁ జదువు చున్నవాఁడే, ఇందుల కాగృహప్రవేశమునకు వచ్చినవారెల్ల సాక్షులే, విద్యా భ్యాసారంభము శార్వరి సం॥ శ్రావణము, ఈమూఁడువత్సరములును, అప్రస్తుత ప్రశంసలో మూఁడుమాసములుగాఁ గృష్ణకవి యపలపించెను, దానిం గూర్చి యిందు ప్రస్తావించుటకన్నఁ బ్రశంసాఖండనముకుఁగా నేర్పడిన లోకాభిరామాయణము లోనే ప్రసంగించుట యుక్తము, పైపద్యములకాగితము మాశిష్యునివ్రాలుంటయే కాక యతని స్వహస్తలిఖితాక్షరములు గూడఁగలది. కృష్ణకవి దీని నెట్లో యపల పింపక మానఁడు, చర్లచలపతి క్షమాపణలేఖ కన్న దీనియెక్కువయేమి.

“న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి”

ఈకారికి నతఁ డసత్యవిషయమునఁ జేయూఁతగా గ్రహించుచున్నాఁడు అది యటులుండె, ఆపద్యము లిప్పటియితని ‘దేవగురు నిందాత్మకమగు మతము నకుఁ దోడ్పడవు’ ఈమత మిటీవలకుక్షింభరిత్వ ప్రయుక్తమైన గురుదూషణను సమర్థించుకొనుట కవలంబించినదియే, దీనిపేరేమి? వివేకదారిద్ర్యము, అదియవ లంబించినవారి కొకమతమేమి, యొకక్రోశమేమి, యొకతెన్నేమి.

“శ్లో॥...వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః”

అనుభర్తృహరి బుద్ధివిహీనుఁడా? శాంతం పాపం, ఇట్టివీరివ్రాఁతల నేల విమర్శింతవలెను? విమర్శించునట్టివారె మూర్ఖులను.

“కొయ్యతోఁటకూరకును సిగ్గు లేదు, కొడవటికిని సిగ్గు లేదు”

అని చదువరులు విసిగికొందురని తొలఁగుదుము, కాని మాశిష్యవరమా ణవులిరువురలో రెండవవానిని లిఖియించు ననృతములకుఁ బారము లేక-యుం

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయమితభాషిణాం, యశసే విజిగీషూణాం, ప్రజాయై గృహమేధినామ్.

(ఇతి కాళిదాసః)

ఓమ్, సత్యం తపః, నాఽనృతం వదేత్.

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వరులు.



## శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | — | పంక్తి. | — | తప్పు. | — | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|
| 4 | — | 3 | — | దురా | — | దురాశ్ర |
| 7 | — | 2 | — | బాఁప | — | బాప |
| 7 | — | 25 | — | బిట్ట | — | బిట్టు |
| 12 | — | 25 | — | దగ | — | గద |
| 14 | — | 19 | — | ధీర్ఘా | — | దీర్ఘా |
| 30 | — | 1 | — | గుభక్తిఁ | — | గురుభక్తిఁ |
| 31 | — | 15 | — | శ్లో దివం | — | శ్లో॥ దివం |
| 33 | — | 20 | — | సాఁకు | — | సాకు |
| 45 | — | 23 | — | వగుట | — | వగుటనై |
| 45 | — | 28 | — | మైౖత్రి | — | మైత్రి |
| 52 | — | 15 | — | యుండి | — | యుండి |
| 56 | — | 8 | — | వ్యంముశ్ర | — | వ్యముశ్ర |
| 56 | — | 17 | — | రిష్టంత్వ | — | రిశిష్టత్వ |
| 75 | — | 10 | — | లైడిసల | — | లైడియం |
| 84 | — | 16 | — | అపరశి | — | అపరశ్శి |

స్థూలదృష్టిచే దిద్దిన వీనివలన వీని సజాతీయములను గూడ దిద్దికొనఁ గోరుచున్నారము.



శ్రీమత్పరదేవతాయైనమః.

# గీరతము, గురుదక్షిణ.

(రెండవభాగము)

## (1) ఆశీర్వచనపర్వము.



క॥ కౌత్సుఁడు గురుదక్షిణ యిడ, నుత్సాహం బెంతయేనియును జూపఁగ "సో
మత్సాహి వలదనియె నీగుణ, వత్సలు వరతంతుమౌనివరుఁ బ్రణుతింతున్ ౧

ఉ॥ తప్పక నీకొసంగఁ దగు దక్షిణ దేవర యంచు వేఁడుచో
తప్పుగ నెంచి శిష్యుపయిఁ దాఁగను లెక్కఁగఁ జేసి "పొమ్ము తె
మ్మిప్పుడ కొన్నికోటు"లని యేగురుఁ డానతివెట్టెఁ దత్కథన్
జెప్పిన కాళిదాసకవి శేఖరుఁ డెల్లజగమ్ము నేలుతన్. ౨

తే॥ గీ॥ అంతముకోపి నంత దయార్ద్రచిత్తు
నంత నిస్పృహు నంతధనైకలుబ్ధు
శాంతు సంతోషవంతుఁగా నలుపుకౌత్సు
చరిత దురితాపహము సర్వసమ్మతంబు ౩

క॥ గురుశిష్యధర్మముల నెఱుఁ,గరు పల్వురు పెద్దలిపుడు కలికాలవశుల్,
తిరుపతి శాస్త్రివారల, కొఱకుఁజుమీ గీరతాఖ్యగురుఁ డేర్పడియెన్॥ ౪

క॥ గురుదక్షిణనూటార్లు *శి, వరామకవి నాకు నిడఁగ వచ్చినకంటెన్,
బరమానందమొసంగెడి, గురుదక్షిణ చూవె "కాకకోకిలము"సఖా.॥ ౫

---

(బెజవాడ శతావధాన పీఠికనుండి.)

*......అట్టిబహుమతిని నవధానిగారు (శివరామశాస్త్రి) తమకుంగల గురుభక్తిం బ్రకటించుచు బ్ర॥ వేంకటేశ్వరశాస్త్రులుగారి కొసంగిరి కాని వారు నీళ

క॥ *కోకిలకాకముఁ గంటివె, యేకళగా నున్నదో యి హీ? యని నగరే
కోకిలతుఁ గాకియెడ గురు, తాకల్పన మెట్లుకుదురఁదగునో యకటా. ౬

సీ॥ తాను నాయొద్ద వృథాగ శుశ్రూష చేసెనె కాని విద్దె చెప్పనఁట? నేను
విద్దె చెప్పుటకేమి కొద్దిగా నైనను జ్ఞానంబు గలవాఁడ గానఁటేను
పొరపాటుచే నాదు చరణ మంటెనెకాని తా నంతమున్నె విద్వాంసుడంట?
పొట్టకై తిరుగు టెప్పుడు నాదువనియంట! యక్రమ్ము శ్రవన రవంతయైన
తే॥గీ॥ విద్దె చెప్పనె లేదంట! వినిగిపోయె, నఁట! చెప్పినముక్కైన నంతమంచి
ముక్క గాదంట! చప్పనిముక్కయంట?, పదపఁదియ్యనిముక్కలు చదివెనంట

సీ॥ పనితనం బరిగినపై నేను మూర్ఖుఁడ నని తాఁ దెలిసెనంట! యంతమీఁద
భంగపడితిఁగదా! భగవంతుఁడా యంచుఁ జింతించి చనెనంట! యంతలోన
నంతంబు బుతువంట! జాతి సులభమైన విద్దె యబ్బినదంట! వీను లలరఁ
గవిత చెప్పెడినేర్పు కలిగి రసాలంబు నాశ్రయించిన దంట! యకట! కంచి
తే॥గీ॥ గరుడ సేవయె కాని నాకాళ్లఁబడిన, ఫలము లేదంట! యెందుకో తెలియదిట్టి
పాడు వ్రాఁతలు, విన్నవార్జోడుకంక, దృష్టి నిగిడింతు రనియేనిఁ దెలియఁబడదొ

---

క్రియ నాకు వేయిన్నూటవదారులని గ్రహింపరయిరి......

ఇట్లు, గొల్లపూడి లక్ష్మణశాస్త్రి.
బెజవాడ, సి- యం- యస్- హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

☞ ఈక్రిందిపద్యములను గడుశ్రద్ధగా మదికెక్కించుకోవలయును

(నవంబరు 1910 వ సం॥ కవితాపత్రికనుండి.)

# *కోకిలకాకము

గీ॥ బలునకు మఱంది; కృష్ణునిబావ జెట్టి,యు నగు భీమునకోడి సురయోధనుండు, ధైర్యమునుగోలుపోయి యెద్దాన డాఁగి, నాఁడోయదియొందు ద్వైపాయన హ్రదంబు. 1. గీ॥ అమడువుచెంత నీరనంబైన చింత, కొమ్మపైఁ గూర్చుండెఁ గులాయమ్మైనొక్కఁడు, గట్టుకొని యందుఁ బలుగాకి కాకియొకటి, లాఁతికవులోక కొన్ని గొల్వఁగవనించు 2 క॥ కాకవులువాఁడు నాఁడును, నీకంఠస్వరము వర్ణనీ

తే॥గీ॥ ధనికుల గృహస్థులఁట! యేను గునికి పాటు,
లచటఁబడుచుందునఁట! ద్వారమందుఁ దాను
భక్తితో నప్పుడునుగూడఁ బాయకే యు
నర్చునఁట! సేవ, ఫలము సున్నయఁట! తుదకు. ౯

సీ॥ తనసిరికోర్వక తప్పులు తనకబ్బములను బట్టెదనఁట! యెలమి నొకట
నెట్టులేనియు నన్ను నీవు దేశికునిగాఁ జెప్పికొమ్మంచు యాచించితినఁట!
తాను గోకిలమాటఁ దెప్పంట! కాకినౌనను గురుగాఁ జెప్పికొనెదు నెడల
నయినను జెప్పట కంగీకరించెనం టామీఁద లోకు లీయంశము విని
తే॥గీ॥ "కాకమఁట! తాను గురువఁట! కోకిలకఁట!,
యిందులకుఁ గోకల మొకింత యేని సిగ్గు
లేక యెటు చెప్పికొనియె నుశ్లోకులకడ,
నంచు నచ్చెరువడి రంట! యనఘులెల్ల ౧౦

---

యాంబని త,న్నేకొని యాడఁగ నదిసిజ;మేక దెగియనితలఁచి వాయసేశ్వరుఁ డెగయుఱ్ఱెపె. గీ॥ క్రమముగా గర్వమధికముగాఁగ గాయ,కోత్తముఁడ నేనటంచు నూరూరఁదిరుగు,కాకి పలుగాకిమూఁకలఁగలసిమెలసి, కడకు గాయకబిరుదమ్ము గట్టుకొనియె 4 సీ॥ ఒకసారిపొగరెక్కి శుకశారికాదులఁ గయ్యంబునకుఁబిల్చుఁ గాలుదువ్వి,యొకమాఱు కాకవిప్రకరంబు తన తీరువినుతింపమత్తిల్లి విఱ్ఱవీఁగి,యొక వేళ వెడఁగుబాలకులు గాలికిమువ్వఁగట్ట మిన్నులుముట్టుగంతు వైచి,యొకనాఁడు తన పాటలకుమెచ్చు పక్షులఁ జేరి "కా" యని హాయి నోరు దెఱచి గీ॥ వేఱొకప్పుడు తన రూపవిభవమెల్ల, వారుఁ గనుఁగొని యచ్చెరుపాటునొందఁ,దలఁచి పటపట ఱెక్కలు దులుపుకొనుచు నెక్కి యుండిన చెట్టుపైనెక్కి నిక్కి. 5 క॥ ఏకడకునేగినప్పుడో,రాకొమరుల సౌధశేఖరంబుల వ్రాలుం,గాక వికటంబుగా మన,కాకేశ్వరుఁడంతమాత్ర గరుడుండగునే? 6 చ॥ కొలఁది యెఱుంగలేని యొల కోయిల యొక్కఁడు వాయసేశ్వరు, న్వలఁతియకాఁ దలంచి తన వారలఁ జీరికిఁగోక ముద్దుగాఁ, బలుకునదయ్యొ గానమునఁ బాండితినెక్కుడు సంగ్రహింపఁగాఁ, దలఁపునఁ జేసి వాయస పదంబున కేగె ముదంబు పెంపునన్. 7 ఉ॥ జ్ఞానములేని వాయసుఁడు గాయకుఁడంచుఁ దలంచివానితో, గానము నభ్యసింపఁగఁ బికంబున భిజ్ఞత నేగుదేరఁగాఁ,దానును గాయకుండనని తత్త్వము మార్పడఁజేసి దానికిం

క॥ అచ్చెరువిటఁ జెందెడి,రానచ్చరితులు! మీరుఁగూడ జగమునఁ గలరే!
పొచ్చెములేక వచింపుఁడు, చచ్చెనె? మీ యెడలఁ గూడ జ్ఞానలవంబుల్ ౧౧
క॥ గురువుల్ "గురువని" చెప్పిన,దురితమ్ము సహింపరోటు! దురాగ్రముగాఁ
బరికింతిరే మీరలు, సరిగా వచియింపుఁ డయ్యా! సజ్జనులారా ౧౨
క॥ క్షమియింపుఁడు మీరును లో,కమునం దున్నారటంచుఁ గాంచనుజాం డో
యమలాత్ములార? యీయ, క్రమపుఁ బ్రాఁతలకుఁ జేయి కదలుట యెట్లో ౧౩

---

గానము సెప్ప సిద్ధపడెఁగాకము లోకమువారు నవ్వఁగన్ 8 క॥ లోకోత్తరమ
గుగానము,కోకిలడింభకము చదువుకొన వచ్చుటనెం, తో కుబుకుచుమన్నించెను,
గాకిగుణంబెవ్వఁడేని కాఁదనగలఁడే 9 గీ॥దినదినము మేఁతకై దేశదేశములకుఁ,జ
నుచుఁగలవారిముంగిళ్ళఁగునికిపాట్లు, పడుచునుండిన విహవక భక్తితోడఁ,గొలుచుఁ
గోయిలవిద్దెపైఁగలుగు పేర్మి" 10 ఉ॥గొప్పకు నెందుఁబోయినను గోయిలఁ దోకొని
పోవుఁగాని దా,నెప్పుడుఁబొట్టకూటికొఱకేతిరుగాడుచునుంట నేమియున్, జెప్పదు
కాకి కోయిలకుఁ, జెల్లియొకప్పుడు సెప్పఁజూచినన్, జప్పని కూఁతదక్క సరసం
బగు పల్కొక్కఁడైన రాదుగా. 12 గీ॥ ఎన్నఁటికివైనఁ జెవులకునింపునింపు, నొ
క్కపలుకేని తెలుపదాకో? యటంచుఁ, గోకిలము పుట్టెఁడానతోఁ గాలిచెఁగాని,
యెప్పటికిదాఁ గోరిక యీడేరదయ్యె 13 క॥ ఎఱుఁగదు పికపోతముదన, గురువున
కుం గలుగువిద్య 'కొలఁదిఁ బనితనం,బరిగినపిఱుందనే య,త్తెఱఁ గంతయు దాని
కొఱ్ఱుఁ దెలియఁగనయ్యెన్ 14 గీ॥ కాకివైఖరి మనమెఱుంగనిది కాదు,కాకి గా
నము క్రొత్తదిగాదు మనకు, గంటుఁగోయిలపిల్ల యక్కాలమందుఁ, బనితనంబాటఁ
దెలియక భంగపడియె. 15 గీ॥ చాలఁ గాలంబు విసిగి వేసారి తుదకుఁ, గాకవికి
గాణతన మెట్లు గలుగు ననుచుఁ, దెల్లమగుటయు మిపులఁ జింతిల్లిపికము. కాక
మును వీడి తనవారిఁ గలసి మెలఁగు 16 గీ॥ అంతఁ గోయిలపిల్ల వసంతకాల, మ
వతరింపరసాలమునధివసించి, సరసులెల్లరుమెచ్చ స్వజాతి సులభ, మయిన గా
నంబు కర్ణపేయంబుసేయు 17 ఉ॥ కోయిలపిల్ల మేలుతనకున్ లభియింపకయుంటఁ
జేసి య,త్యాంతహీన మానసయి హృదయంబుఁ గలంప నహర్నిశంబు న, వ్వా
యసమూర్తి భూమిఁగలవారికిఁగోయిలపాటఁ జేఁదుగాఁ, జేయుతలంపునం జెవులు
చిల్లులు, వోవఁగ గూయు నీగతిన్.18 గీ॥ విబుధవరులార! కోయిలపిల్లపాట, కర్ణ
పరుషంబు; మున్నునాకడనె విద్య, నేర్చె;దీని కొంతయు నేరుపు; కల,శంతములు

సీ॥ నాకంఠరవము వర్ణన చేయుమీరల్లఁ గాకపులంట! యక్కట తన నాకు
గర్వం బెదిగెనంట! కాలికి మువ్వంట! గట్టినారఁట! పలుగాకినంట!
పటుతరంబుగ నేను బటపట జెక్కలు దులుపుకొంచు సంచరింతునఁట! యకట!,
తాను నాయొద్ద విద్యను నేర్చుకో రాఁగ మన్నించి చెప్పినమ్మంచితనము
తే॥గీ॥ కూడఁ గూడనిపని యంటని, గొప్పకంట!
తన్నునే వెంటఁ దోకొని తరలుటెల్ల
నంతియేకాని చెప్పలేదంట! యెక్కడ,
యెక్కడున్నాఁడో భగవంతుఁ డెందు లేఁడో!, ౧౮
క॥ ఓరా! భగవంతుఁడ! నీ, నేరుపు మెచ్చంగ వచ్చు నేఁటికి సృష్టి
ప్రారంభ మాది యిప్పటి, కీరితి మహత్మ్య జగతి కిచ్చిన కతనన్ ౧౯

---

గౌరవార్హములే "కావు కావు" 19. గీ॥ చాలఁగాలమునుండి మచ్చటగఁ బాడు, కాకములసామ్య గానము; గాంచి నేర్చి, మెచ్చి నాయొద్ద నేరుచుకొన్న పికము, కలరవమ్ములు మధురములే "కావు కావు" 20 గీ॥ కాకి యోర్వఁగలేక యిక్కరణి నెపుడు "కావుకా"వని కూయునకాని ధరణి, నెఱుఁగరొకో కలకంఠము నెల్లవారు, వినరొకో? వాని గానము వీనులార. 21 క॥ కాకను దవకొక గురువని, యే కోయిల నెప్పుడైన నేమి యనూయుం, జేకొని పికముం గాకం, బేకరణిను నిందలాడ నేతలపోయున్ 22 గీ॥ కాకి యొకనాఁడు కోయిలకడకువచ్చి, యోరి! పికపోత! నీగర్వమధికమయ్యె, తొల్లి గానంబు నెల్ల నాతోడఁ జదివి, కృతమెఱుంగవు నీకింత కేరమంబె?. 23 క॥ అంచున్ గెంచు వరంబునఁ, జంచువుఁ గదలించి వాయసము దన్నున్ యా, చించిన నుజ్జ్వలముఁ బ్రబ్చు రించెదన నికోకిలమ్ము రేపున్ మాపున్ ఉ॥ తేఁకువగల్గునాఁడు పరదేశములం జరియించు వాఁ డతి, శ్లోకుఁడు వేఁపపండ్లు దిని చొక్కెడు కాకవిసార్వభౌముఁడే, నాకు గురుండు నమ్ముఁ డనినన్ మనకోకిల పాక; మేలొకో, లోకము వారు నమ్మరది లోపము కాదుగ వానిబుద్ధికిన్. 25 ఉ॥ కాకము గాయకుండఁటని పికంబునకుం గురువంటని తన్నుఁ గూ, శ్లోకులలోన వాకొనని లోపము కోయిలపిల్లదఁటని తా, నేకడు ధర్మవర్తియఁటని యిద్ధగుణుండఁటని వింటిరయ్య! యీ, సాఁకులఁటంచుఁ జెప్పుకొన సాగిరి లోకులువింతవింతగన్. 26 క॥ కోయిలకుం గురుఁడను నే, నేయని యెప్పుడును జాటు నెల్లెడలంగా, నీయెడను బాటింపమిఁ, బాయని రోసమునఁ గలఁత వడువాయసుఁడున్. 27 క॥ ఈయున్న తఱిని

క॥ మంతనపు సంగతుల నలు,సంతయుఁ దూచాలు తప్ప కంతయు నేను
స్వాంతుం డెఱుంగు నాభగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్
క॥ ఎంతో నీచ మగు తటా,కాంతరమున నేస్గపాద మల్లనఁ గొనుదు
శ్చింతయు మొసలి నెఱుఁగుభగ, వంతుండున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

---

గండుం, గోయిల కాకముననుంగుఁగొంగం గని యెం,దోయెత్తిలిన గెనఁట, యది,యేయొకరంధ్రముగ విగ్రహింపఁగఁదొడఁగెఁ. 28 ఉ॥ కోకిలమట్లుకయ్యమునకు న్మది గొల్పదు ముద్దులొలగ్రఁగా,వాకొనియెల్లలోకులను వశ్యులఁ జేసినదయ్యునెవ్వడో,కాకము నొద్దనుకగ్రపరి గానము నేర్వఁగఁ బోయియుండుటఁ, గాకిఁకఁ గోకిలమ్మునకుఁ గయ్యము తియ్యము గాక యుండుటన్. 29 క॥ అదికారణమ్ము గాఁ ద,న్నెదురఁగలే దని తలంచెనే మో? కాకం,బాదిగపికహూజితమ్ముల, వెదకివెదకి చూపసాగె వెఱ్ఱిదొసంగుల్. 30 చ॥ ఎఱుఁగదుగాక కాక మొకయింగి చుకయేనియు నాత్మశక్తి; వా,దెఱవ నపస్వరంబులుగ దే? తనకుం బొడసూపు! గాయకో, త్తరకలకంఠనాదమునఁ దానును దప్పలు వట్టఁజూచినఁ, గరుసగు నే వికస్వర పికస్వరమెవ్వరికేని యంతలోన్. 31 క॥ కాక మొకవక్త్ర కోయిల, మూకంబని మదిఁ దలంచు మొఱకులఁ దెలుపన్, లోకోత్తర మగుఫణితిని, కోకోయని కూయసాగెఁ గోకిలమంతన్. 32 ఉ॥ చేసెదుచేఁత యుత్తములచిత్తమును త్తలపెట్టుచుండుటం, గూసెదుకూఁత కర్ణములకుం బరుసంబుగఁ దాఁకుచుండుటన్ వాసియు వన్నెయుం గలుగువారలు "హు." ష్పిపాఱఁదోలినన్, నాసరివారు లేరనియె నమ్మను వాయసుఁడేమిసెప్పదున్. 33 క॥ కొంగొంగురనుచుఁ గూసెదు, కొంగను ముంగిళుల మెలఁగు కొంచెపుఁగాకిన్, బంగారు పంజరమ్మున సింగారింపఁగ నెవఁడు చిత్తముఁ గొలుపున్ 34

(కోకిలకాకము)

తెలిసిన తాను గానమును దెల్పన దేయగుభోఁ,
గొలువకయున్న దోసమది కోయిలపిల్లదె కా,
తలఁపఁగ రానికూఁతలను దత్త్వమెఱుంగక కో,
కిలమును దూఱి వాయసము కీరితిఁ జెందునుకో? 35

శ్రీపీఠికాపుర సంస్థానవిద్వాంసులు, వేంకటరామకృష్ణకవులు.

క॥ ఇంతి ద్రుపదాత్మజాత సం,భ్రాంత రమున దుస్ససేనునవమానంపుం
గంతులకుఁ బాఁపఁగల భగ,వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ భ్రాంతిన్ బ్రాజదుపు లుద, న్వంతుని లో దాఁచుదాంగవాని నసుర దు,
శ్చింతుని గనుఁగొను నా భగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ ఇంతి జగన్మోహిని దా, సంతర్పణఁ జేయ సురలనందున నరి య
ల్లంత నిలుకు లేఁ ఆఁగిన భగ, వంతుండున్నయెడఁ దెలియవలయున్నిజముల్

క॥ సంతమసములోన నుద, న్వంతునిలో నందుకొండ ప్రక్క జరుగు వ్ర
త్తాం తమ్ము నెఱుఁగు నా భగ, వంతుండున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ ఓయీ తిరుపతి శాస్త్రీ?, నాయీ శిష్యుండు కాకి నామము నాకున్
వేయాఱు లిచ్చుటకు బదు, లా యైశ్వర్యభాగ్యములు గోరి యర్పణఁ జేసెన్. ౨౨

ఉ॥ ఏనును నీవు నిక్కపుఁ గవీంద్రులమే యగు టొప్పనేని దు
ర్మాని మదీయశిష్యు నపరాధ మ దెంతటి దైన నేమి య
జ్ఞానకృతంబుగాఁ దలఁచి కాచి నిను నన్ను సదయ్యశఃపరా
ధీనులఁ జేయుఁగాతఁ బరదేవత శిష్యుఁ జిరాయుఁ జేయుచున్. ౨౩

మ॥ మనలన్ దిట్టినఁదిట్టుఁ గాక తగ నస్మచ్ఛిష్యుఁడౌ నీతనిన్
ధన ధాన్యాదిక మాయువున్ సిరియు విద్యాబుద్ధులన్ గూర్చి వృ
ద్ధిని నందించెడిఁ గాత మాత గురుభక్తిన్ వచ్చు జన్మానకే
ననుసంధించుతఁ గీర్తియుం గలుగుఁ గాకానాఁడె యవ్వారిగన్. ౨౪

మ॥ కలుగున్ గావుత సూర్యరాడ్విభునకున్ గళ్యాణపారంపరల్
దెలియుం గావుత మేరికన్నఁ గవులే దేవాంశసంభూతు లం
చిల నీశ్రేఁ డొనరించు పుణ్యములె మాయీశిష్యదుర్దోషపుం
గలికాలంపుఁ బ్రివర్తనం బుడిపి పైఁ గాపాడి రక్షించుతన్ ౨౫

సీ॥ మొదలంట నడఁగంటి మూలమూలలనుండు వేదశాస్త్రమ్ములు వెలికి వచ్చె
మనకు దిక్కెవ్వరో యని కుందు నాంధ్రకవులకవిత్వము నేఁడు వెలికి వచ్చె
నెందుకు సృష్టించె నీమమ్మ నని బిట్టవందురు ననదలవంత లడఁగె
నెట్లు నిల్చెడి నొకో? యీ పాఠశాల లిమ్ముల నన్నశాల లుజ్జ్వలత కెక్కె

తే॥ గీ॥ నెవని కతమున నట్టిమనీషిపాద, రేణుపావితసత్ప్రభాశ్రీవిశాలుఁ
డార్యసూర్య రాయేంద్రుఁడనర్ఘసుకృత, మగునుగాక మాశిష్యుని కంగరక్ష.

కం॥ ఇఁక నీయవస్థవినుమా!, ఐకసైతివి నీవు; నిన్నుఁ బకవక నెవుడో
పికపోతము పొగరున నెం, దుకొ నవ్వినదంట! యెఱుఁగుదువె యదినఖుఁడా.

కం॥ అదియే కారణ మఁట? నీ, మది గలఁగుట కక్రూతము నమచ్ఛరమునఁ ద
న్మ్రదిరింప రండటంచుఁ, గదనమునకుఁ బిల్చె తఁట! కంటివెయిదియుఁ.

కం॥ ఎదిరించెడి నేర్పది యు, న్నది యఁట! చదు వబ్బకున్న నదియే పోయెఁ
గదనము గురుతోఁ జేయఁ ద, గదు పొమ్మని మానెనంట! కంటివె సఖుఁడా!.

కం॥ ఎంతటి తెల్వియొ చూడుమ!, యంతే వాసిత్వమాతఁ డంతో యింతో
యెంతో నా కొనరించెను, జింతింపఁగ నేల నిన్నుఁ జెనఁకుట కనఘా. 30

కం॥ గాంగేయు నెఱుఁగఁడో? పా, ర్థుం గనఁడో? భారతమున; దాంగప్రసంగం
బుం గనలేరే లోకులు, "మంగలి మాధ్యస్థ్య" మనుచు మది నెంచెనుకో!.

కం॥ వందియ మందెను సరియే, వందవలెఁ వదరుపట్ల భయ మది లేదో!
యెందుల కీవ్యాస మ్మిది, పందతనము తెలుప దొక్రొ బాలునకేనిఁ. 32

కం॥ భారతమున నున్నదా యిది, గీరతమునయందుఁ గలదా కేవలముగ ని
చ్ఛారతి వ్రాసిన దేకద!, మోఱకు లనరొక్రొ? వినిన బుధవరులెల్లఁ. 33

కం॥ అన్యాపదేశ మన ని, ట్లన్యాయపు వ్రాఁత యగునె యకటా? విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీర, మ్మన్యులకుఁ మంచి చెడ్డ మహిలోఁ గలదే. 34

కం॥ ఎవఁ డేడ్చెఁ దన్ను, శిష్యుఁడ "నవుదును నే,,నని వచింపు మని లేదని బొం
కు విధము దీనికి నెంతో, నవిశేషము గాక యున్నె జదుఁ దెఱుఁగు నెటుల్

చ॥ "చదివితి నిక్రూమే గురుఁడు చప్పనికూఁతలు నెప్పినాఁడు నే
నదివఱకే కళావిదుఁడ" నంచు వచించి పికత్వ మూని దు
ర్మ్రదమునఁ గాకిగా గురుని దాటికిఁ జెప్పటకన్న నొప్పదే
"చదువనె లే"దటన్న నిది సత్య మటంచుఁ దలంచెనో కదే. 36

ఆ॥ వె॥ కల్ల కాటినత్య మిల్లు నట్టేటిలోఁ, గట్టి కొన్న వగిదిఁ గానఁబడెడి
నెల్లవారు నగరె "యిహిహి" దురాగతం, బనరె యేరు చెప్పి రకట! యిట్లు!

ఉ॥ కొంగగ నిన్నుఁ బేర్కొనిరి, కోరినవాఁడవు నీవు వారితో
సంగర, మందులోఁ జూతఁగఁ జాలమికిన్, "బకమేడః గాకితో
సంగర, మేడ నంచుఁ బెలుచన్ లిఖియించిరి హేతు,వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితొ? గొంగ యనంగను శత్రు వందురో. ౩౭

క॥ అటుమీఁద శత్రువునకున్, దటకావడి మూలఁబడుట తథ్యముకాదే!
యొటు వ్రాసి కొన్ననేమి క,పట మొఱఁగం బడదె జగము పాషాణంబే. ౩౮

గీ॥ దోమ యేనుఁగుకడ కేగె దారకువఱకు,రక్తమును గ్రోలునిచ్చ, భద్రగజరాజు
నొడలు తనపాలుచేసె నీవెడఁగుదోమ, పాడుతుండంబునకు లేదు పాటవంబు.

క॥ నాకును దుండంబున్నది, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ జొచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!

---

## (2) సూర్యరాయపర్వము



సీ॥ ఆకొండివారింట నాకంఠముగ మెక్కి సత్రంబు చెప్పినజాణ తనము
మధునవంతుల సూరగబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి నున్న యిడుట
అటుమీఁదఁ దాఁ బికంబైనన్నుఁ గాకంబుగా వ్యాసములువ్రాయుగాణతనము
ఆవ్యాసములుగూడ నట నిట గోమయోదకసేచనము గోరు వెకలితనము.

తే॥ గీ॥ గాంచి యేమి "దురాగతం,బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా! యని వగచుచుండ
దారకై నొకఁడు నూజివీట్పురమునందు
దార రసజ్ఞుండు సత్కవిచరణ్య రతుఁడు. ౪౧

క॥ విరవ యను సూరకాపుర, మరసిన వాఁడతఁడు సకల మగుకావ్యములున్
సరిగారు వెలమలన్ ధీ, వరు లతని కటన్న జడుల వాకొన నేలా. ౪౨

క॥ ఎఱుఁగవె! సంస్కృతభారత, పరమార్థజ్ఞుండు రావు వంగడమున నీ
వరిసరమునఁ గలదొరలకు, శిరోమణిభూషణము సుగుణసింధుం డెందున్. ౪౩

తే॥ గీ॥ నైవని కతమున నట్టిమనీషిపాద, రేణుపావితసత్ప్రభాశ్రీవిశాలుఁ
డార్యసూర్య రాజేంద్రుననర్ఘసుకృత, మగునుగాక యాశిష్యుని కంగరక్ష.

క॥ ఇఁక నీయవస్థవినుమా!, ఐకమైతివి నీవు; నిన్నుఁ బకపక నెవుడో
పికపోతము పొగరుననెం, దుకొ నవ్వినదంట! యొఱుఁగుదువె యదినఖుఁడా.

క॥ అదియే కారణ మఁట? నీ, మది గలఁగుట కక్కటతము సమచ్చరమునఁ ద
మ్మాదరింప రండటంచుఁ, గదనమునకుఁ బిల్చె నఁట! కంటివెయిదియుఁ.

క॥ ఎదిరించెడి నేర్పది యు, న్నది యఁట! చదు వబ్బకున్న నదియే పోయెఁ
గదనము గురుతోఁ జేయఁ ద,గదు పొమ్మని మానెనంట! కంటివెనఖుఁడా!.

క॥ ఎంతటి తెల్వియొ చూడుమ!, యంతే వానిత్వ మాతఁ డంతో యింతో
యెంతో నా కొనరించెను, జింతింపఁగ నేల నిన్నుఁ జెనఁకుట కనఘా. ౩౦

క॥ గాంగేయు నెఱుఁగఁడో? పా, ర్థుం గనఁడో? భారతమున; ద్రొంగ ప్రసంగం
బుం గనలేరే లోకులు, "మంగలి మాధవ్యస్థ" మనుచు మది నెంచెనొకో!.

క॥ నందియ మందెను సరియే, పందవలెఁ బదరుపట్ల భయ మది లేదో!
యెందుల కీవ్యాస మ్మిది, పందతనము తెలుప దొకొ బాలున కేనిఁ. ౩౨

క॥ భారతమున నున్నదొ యిది, గీరతమునయందుఁ గలదొ కేవలముగ ని
చ్చారతి వ్రాసినదే కద!, మోఱకు లసరొకొ? వినిన బుధవరులెల్లఁ. ౩౩

క॥ అన్యాపదేశ మన ని, ట్లన్యాయపు వ్రాఁత యగునె యకటా? విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీరమ్మన్యులకుఁ మంచి చెడ్డ మహిలోఁ గలదే. ౩౪

క॥ ఎవఁ డేడ్చెఁ దన్ను, శిష్యుఁడ "నవుదును నే,,నని వచింపు మని లేదని బొం
కు విధము దీనికి నెంతో, నవిశేషము గాక యున్నె జదుఁ దెఱుఁగు నెటుల్

చ॥ "చదివితి నిక్కమే గురుఁడు చప్పనికూఁతలు నేర్పినాఁడు నే
నదివలికే కళావిదుఁడ" నంచు వచించి వికత్వ మూని దు
ర్మదమునఁ గాకిగా గురుని దాటికిఁ జెప్పటకేన్ని నొప్పదే
"చదువనె లే"దటన్న నిది సత్య మటంచుఁ దలంచెనో కదే. ౩౬

ఆ॥ వె॥ వల్ల కాటిసత్య మిల్లు నట్టేటిలోఁ, గట్టి కొన్న పగిదిఁ గానఁబడెడి
నెల్లవారు నగరె "యిహిహి" దురాగతం, బనరె యేరు చెప్పి రకట! యిట్లు!

ఉ॥ కొంగక నిన్నుఁ బేర్కొనిరి, కోరినవాఁడవు నీవు వారితో
సంగర, మందులోఁ జూడఁగఁ జాలమికిన్, "బికమేడ: గాకితో
సంగర, మేడ నంచుఁ దెలుపన్ లిఖియించిరి హేతు,వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితొ? గొంగ యనంగను శత్రు వందురో. ౩౭

క॥ అటుమీఁద శత్రువునకున్, దటకావడి మూలఁబడుట తథ్యముకాదే!
యొటు వ్రాసి కొన్న నేమి క,పట మెఱుఁగం బడదె జగము పాపాణంబే. ౩౮

గీ॥ దోమ యేనుఁగుకడ కేగె దొరకువఱకు, రక్తమును గ్రోలునిచ్చ, భద్రగజరాజు
నొడలు తనపాలు చేసె నీవెడఁగుదోమ, పాడుతుండంబునకు లేదు పాటవంబు.

క॥ నాకును దుండంబున్నద, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ జూచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!

## (2) సూర్యరాయపర్వము.



సీ॥ ఆకొండివారింట నాకంఠముగ మెక్కి సత్రంబు చెప్పినజాణ తనము
మధునవంతుల సూగబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి నున్న యిదుట
అటుమీఁదఁ దాఁ బికంబైనన్నుఁ గాకంబుగా వ్యాసములు వ్రాయు గాణతనము
ఆవ్యాసములు గూడ నట నిట గోమయోవక సేచనము గోరు వెకలితనము.

తే॥ గీ॥ గాంచి యేమి "దురాగతం,బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా! యని వగచుచుండ
దొరకె సుకృతుఁడు సూజివీట్పురమునందు
దొర రసజ్ఞుండు సత్కవిచరణ్య రతుఁడు. ౪౧

క॥ విరవ యను సూరుకాపుర, మరసిన షాఁడతడు సకల మగు కావ్యములున్
సరిగారు వెలములన్ ధీ, వరు లతని కటన్న జదుల వాకొన నేలా. ౪౨

క॥ ఎఱుఁగవె! సంస్కృతభారత, పరమార్థజ్ఞుండు రావు వంగడమున నీ
పరిసరమునఁ గలదొరలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెందున్. ౪౩

గీ॥ ఎఱుఁగు నీతండు నాయొద్ద నెంతవఱకుఁ
జదువుకొన్నాఁడొ చిదక నీసాహసమున
కెట్టులాడిగట్టి పాఠంబు గుట్ట నైకప్రఁ
దలఁచుచున్నాఁడొ సర్వమ్ము తథ్యముగను. ౪౭

క॥ నా కడను వచ్చునప్పటి, కీకవి జ్ఞానం బదెంతొ? యీదెంతయొ? నా
కాకత్వ మితని కోకిల, పాకత్వము గూడ నెఱుఁగు భవ్యుఁ డతండే. ౪౮

ఉ॥ ఏ నలనాఁటివీదుపురి కేగి వధానము సేయునాఁటికి
జ్ఞానిశిరోవిభూషణము ఛాత్రుఁడు గాఁ డతఁ డెంచినాడు వి
జ్ఞానము బోధ సేయుటకుఁగా దయ గల్గిన వాఁడుగాన, ని
త్యానిని సూర్యరా వపుడు వాస్తవ భక్తిని జూచి నాఁ డటన్. ౪౯

శా॥ సూరిశ్రీసకలన్వవేత్త యగుసీ సూర్యం డెసూ! పూర్వ ము
ప్పారాయుండ్రని సన్నిధానమున నాగాశట్యంపువిద్యాఘనిన్
శ్రీరామాఖ్యుశతావధానివసఁ దేల్పెన్ మీఁద నా సూరి న
ప్పారా వొక్కఁడె కాక తన్నగరమువాకోడు తత్త్వజ్ఞుఁ గన్. ౫౦

శా॥ అప్పారావున నంతకన్నను విద్యావేదులైనట్టినా
రప్పారావును నమ్మహాత్మ్యనసుజాంద్రైనట్టి సింహాద్రిశ్రీ
యప్పారావును జూడ వచ్చె నితఁ డయ్యార్యుల్ "భవద్భక్తి మా
కొప్పన్ బో" దని తండ్రిపోలిక్ నని రాఘ్యల్ తత్త్వ మూహింతురే, ౫౧

ఆ॥ వె॥ ఈరసజ్ఞమూర్తియే కాదు శ్రీమాచి, కులుఁడు నారసింహకోవిదుండు,
గూడ నెఱుఁగు నితనిగురుతయు నాశిష్య,భావ మమగ నతఁడువచుతు నిజము,॥

క॥ ఎవ్వారతలుకఁ నేటికి, యివ్వయ రట్టును నిదేల రసికులకు? ననున్
బ్రబ్బవ్వఁగఁ దిట్టిన వ్యాసమొ, ముప్పలు గట్టికొని యిట్లు మొఱఁగుచునుండన్,

మ॥ ఎవ రీకోకిల! శ్రీమదోలెటికులాంభోనాబ్ధిరాకావిధుం
డశ్రీ వెంకట రామశాస్త్రి యను లోకాహ్లాది, కాకం బెవం
డెవఁడో యిట్టులు? శాస్త్రిగారి గురు వానివెంక పేరుం డహో!
యెవఁడీ కొంగ! దివాకరాన్వయమణీ? యీవేగుమే శ్రీపతీ. ౫౪

సీ॥ నాకొడుకుఁ దాఁ గృతఘ్నత్వనామకమహాపాతకి యొట విస్పష్టమంట!
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బరమందుఁ గనుట తప్పనిదె యంట
అంతియే కాని నాకాతఁడు శిష్యుఁ డం చని నేను జెప్ప టనర్హమంట!
పైదానఁ దనకీర్తిఁ బలికించునే కాని నాకు యశంబగునన్న యగునంట!
తే॥ గీ॥ జౌర! యెటువంటివేదాంత మభ్యసించె?
"నేమి శాశ్వత మూగోడ యుంచుకొంత
యవల జరిగించి పెట్టకొం, దని వచించు
వెఱ్ఱివేదాంతితన మిట "బట్టు,, మనియొ.॥ ౫౫

(౩) సంబుద్ధిపర్వము

క॥ "మావాఁ డతిదుర్మార్గుఁడు, మీవానిశిరమ్మునందు మేకులు గొట్టం,
దేవేశ నేమి సేయుదు, కావలమున నన్న నీతిగనఁ జేసెదవా! ౫౬

ఉ॥ వేంకటరామశాస్త్రి! విను విద్య పఠించితి నంచు నొవ్వకో
బంకియుఁ గోకిలమ్ము వయి చక్కఁగ నృష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "జెప్పెపెమెప్పెమె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పికొంటి వది చాలు జయం బగుఁగాక నీ కికన్. ౫౭

ఉ॥ "కాక" వటించఁ దిట్టుదువు గాక శపించెద వందుగాక యెం
కేకలువంపుపేరు లిఖియింతువు గాక స్వకార్యసిద్ధి నేఁ
జేకొనినాఁడ నేఁడుగద! చేకుర మోదము; నీవు తిట్ట లే
దీకవి నీతఁడే యు రక యిట్టులు తిట్టుకొనెన్ గుమారకా. ౫౮

ఉ॥ "తప్పనికూఁతలే" యనుచు ఛాత్రుఁడవై గద! నన్ భజించుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ వప్పటికయ్యె నీవు నీ
చెప్పను గానినాదరిని శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బాశ్వాస యిట్టితిట్టుల కవ్వకో? యటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే. ౫౯

క॥ మొదట "రిజిస్టరుత్తరము" మాటురనమ్ము బగు పట్టుకుండ నేఁ
దగ లిఖియించి తిర్పతిని గయ్యము లై పురికొల్పినాఁడ నీ

వది గని యెంతగా బెదరి తయ్యెయొ? పాతకినైతిఁ దండ్రి! నా
యదయత నైఁపుమయ్య! యిఁకనైనను భీతిని మాను మర్భకా.॥ ౬౦

చ॥ తిరుపతిసింహ మొక్క మొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమున నున్న నాపయి "గుఘుకున" దూఁకు నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు; వీ
శ్వర, యను వేరుసుమ్ము సిను జంకఁగఁ జేసిన దేమి సేయుదున్.॥ ౬౧

శా॥ నీయజ్ఞానము నీదులోభగుణముల్ నీదౌకృతఘ్నత్వముల్
నీయల్పజ్ఞతఁ జేసి గాక యకటా? నీమీఁది కేమంచు యా
గ్రాయత్తుండయి రాఁగడంగు నొకఁ, డే నవ్వానిఁ బ్రాణాలతో
డాయ న్నిత్తునె? నన్ను వీడిగద! కట్టా! చెట్ట వైతింతకున్. ॥ ౬౨

చ॥ తిరుపతిసింహముల్ సరిగఁ దిప్పి ప్రశాంత మొనర్ప వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు గీవకు నోజ గూర్చ నీ
గురునకుఁ జర్లసంగ్రహునకుఁ గూడ వశం బెటు లయ్యెడిన్ దుర
ద్ధర మది, నేను దానిబలుధాటికి నొక్కొకవేళ జంకెదన్. ౬౩

ఉ॥ కాఁకరపర్తిపై కుఱుకఁగా గమకించె నెఱుంగు దే? "శత
ఘ్న్న"కృతి సాహ్యకర్తలును నీవును బావయుఁ బోలె "శృంగభం",
గాకలనప్రసంగ మది యజ్ఞతమై లిఖియించినట్లె వా
పోకయ పోయినట్టులుగఁ బూర్తిగ డేఁకిరి జ్ఞప్తి యున్నదే. ౬౪

ఉ॥ వెంకన బంధు వొకతన వేఁడుఱ్ఱవాఁత లోకింత నైఁచు మీ
గ్జంపుటగాఁ దలంచి పెలుచన్ గుఱుచల్ లిఖియించుచుండ్రు మీ
పెంకెతనాలు సాగ వల బెబ్బులిపై; వెలినాఁటి సింగ మి
ట్టింకుల నింకఁ జేయు నెపుడేనియు; డొంకలె నూఁ? శరణ్యముల్ ౬౫

ఉ॥ ఏది? పదుత్తరం బతని యేత్తెఱవ్రాఁతకుఁ జెప్పుమా? శర
శ్ఛదము కాదె వంటె మిడె సిగ్గు గలట్టి నృజన్ముఁడేని *"మీ
రే దెనకేని బొం"డనుచు నీయఁగఁ జేయునె యుత్తరంబు దా
యాదుని పేరు పెట్టి; యవురా? యివిరా? చవి రానిబీరముల్ ౬౬

*గీరతము, 1 భాగము శాఖాచంక్రమణపర్వము ౬౬వ పుట ౮వ పంక్తి చూ.

ఉ॥ "పొం డల పీఠికాపురికిఁ బొం డటుపొం" డని నీదు బావ బా
వాం డొకలేఖ వ్రాసె నది యాఁతగ నయ్యెడ తేఁకుదేర న
వ్వం డొకఁ డోఁడు "మీ రిటకు వచ్చితి రేటి" కటంచు, నెందుకీ
గండతనంపు వ్రాఁతలు జగంబు యుగంబుల నవ్వ చేటు సూ. ౬౭

చ॥ "పిలిచినయట్టి రాక యటు * బెట్టుగ నుత్తర మిచ్చి యెవ్వరో
చలవతి "పీఠికాపురము చక్రికిఁ బొ" మ్మనినట్టు లెవ్వరో
వ్రాసిన వచ్చువాఁడవె? నగించెడి నీకుఁ బ్రశక్తి" యంచు న
వ్వల నలఁ డోఁడు నవ్వలరఁ బల్కిన నుత్తర మిది పుత్రకా. ౬౮

---

* శ్రీపీఠాపురీ రాజపుత్రోదయ విషయిక, పద్యత్రయము.

సీ॥ ఉదయించె రాజా రావ్వాదవ్వరావనవ్వ దఖవర్ధనుండు సూర్యాంశవ లన, జన్మించె సంతానశాఖి నందనశుభశ్రీ పెంపుమీఱఁ బీఠాపురమున, వెడలెఁ బ్రమానంభవుఁడు సూర్యనందనా నారాయణాంశంబున్నదంచుఁ దెలుపఁ, బొడమె నాండాలమ్మ కడుపు చల్లఁగ రాజసస్యంబు సజ్జన స్తామ మడఁచ॥ గీ॥ మంగమాంబ గతించిన మాననీయ, సుకృతపరిపాకమెల్ల నేఁటికిలభించెఁ, గఁటికగవడె రావుగంగాధరోవ, వదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తనిపె సాధారణం బసాధారణముగ, మఱియు నందును నాశ్వయుజ్మాసబహుళ, షష్ఠమఁ దృతీయయును శుక్రవాసరంబు, మకరలగ్నంబు సూర్యసంభవుని వలన॥ ము॥ గురుడు న్నార్యుఁడుఁ జంద్రుఁడు స్వగృహుఁడు శుక్రుండు స్వభుండు నున్నతై, శ్చరుఁడుం గేతువు రాహువుం గని యశ్రాంతంబు నీవాలునిన్, సిరి దీర్ఘాయు వొసంగి ప్రోతురు బుధాశీర్వాదముల్ తోడుగా, నరవిందాక్షుని కృప సహాయి బలి సూర్యారాయ భూపాలకా.

25-10-10 }
కాకినాడ }

దివాకర్ల తిరుపతిశాస్త్రి,
శతావధాని.

* శ్రీరాజ్ గంగాధర్ రామరాయ్ వెంకట
కృష్ణారావు బహద్దరు గారియాస్థాన విద్వత్కవి.

---

True copy of letter from the Private Secretary to the Rajah Pithapuram dated 29th October 10, addressed to

క॥ అతఁడేల చెప్పవలె? నం, సత్కృతనిశ్శేషావదాతధృతనిద్రాసం
గతిగతకాఁకరవర్తి, స్థితసుశ్రుత నేత్రి మడుగఁ జెప్ప నఖిలముఁ. ౨౨

ఉ॥ అట్టిఁడతండు కావున నె యాతనివ్రాల్ గలయుత్తరమ్ము మా
పట్టుననుండె నం చెఱిఁగి బావ "యతం *డది వ్రాయలే,, దటం
చొట్టులు సత్యముల్ గిలికి యుత్పథచారిగ దూఁక జొచ్చె "వీఁ'
డిట్టిఁడు బొంకి యాత్మ కెటులేని యశం బొడఁగూర్చు,, నం చొగిఁ ౨౩

క॥ తాదృశులుదక్క మీదు, ర్వాదములకుఁ దోడు 'సూవ రా రతఁడేనిఁ,
బాదాక్రాంతత కొడఁబడి, నీదగునఘ మడఁచెఁ గొంతనీతి గలాఁడే ౨౪

చ॥ కలతెలుఁగుఁ లిఖించె నలకాతరుఁ డక్కటి? నేరు పెట్టి ;య
వ్వలఁ నెవరో లిఖించు నలపత్రము తన్ను ఘటించి తిర్పతి
జ్వలనము చుట్టుముట్టు నని నంటియ మందఁగఁ బోలుఁ బాపి మే
కొలఁదియుఁ గానిత న్నెదురుకొన్న జగంబు మఱింతనవ్వదే. ౨౫

క॥ తిరుపతి ధోరణి తెలిసెనె, "శర"ణని నీబావకై యశస్కరుఁ దతో
దరి నిడిన బావమఱఁదినిఁ, బొరిఁబొరిఁబలికించి కాచి ప్రోచెఁ గరుణఁ. ౨౬

చ॥ అతఁడు కృతజ్ఞుఁ డౌటఁ జూమి యాత్మకు వెంకననాము వీనినీ
చతరపికాభివర్ధనుని శ్రీసద్గురుఁగా లిఖియించె దానిచే
నితనికి వాఁడు తక్క వని యెంచుచుఁ దిట్టితి వెంత చేలవోని
కృతమును జూపునంతటనె కేవలనీచుఁ డెవండు గాఁడు సూ. ౨౭

(నవంబరు 24వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

*తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంధకర్తకు రిజష్టరు జాబు వ్రాయుటచేఁగాని యాతఁడు వ్రాసినట్లు యథార్థవాది యభినవ సరస్వతీపత్రికలోఁ బ్రకటించిన యుత్తరము చేఁగాని ప్రయోజనము లేదు. ఆయుత్తరము సత్యాసత్యములుసమయము వచ్చినప్పడు తెలకపోవు....

శ్లో॥ భవ్యసి భావపదారవిందభవుఁ జెల్వ ప్పిళ్ళ్వంకార్ణవో!, ద్భవునిఁశా 1
స్త్రవదంవదానహాభవుఁ భాస్వద్గవుఁ సాహితీ, భవుఁ మేఘగభీరవిస్ఫుట

చ॥ కృతమును జూపకుండునరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ బత్త్రలంబునన్
మతి చెడి ''శాక,, మంచు నొకమాటును గల్పనఁ జేసి నన్నుఁ ది
ట్టితి వది యేమి కార్యము! గడింది యశమ్ము గడించు త్రోవయే. ౭౮

చ॥ ''తిరుపతి నామయున్ గవిసెఁ దీవ్రత మద్గురు వైనవేంకటే
శ్వరునికి తానఁ గాదె, యని శాంతి మెఱింగిన నీవు తద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము నూటిగ వ్రాయక యేటికయ్య! యా
చరితపువ్రాఁత; కృష్ణుఁ డెటు దోఁపఁగఁ జేసెఁ గుమార! చెప్పమీ. ౭౯

క॥ చరులకు శాంతిం గఱపెడి, పరమోత్తమ గురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁగాకి నని నీకుఁ దోఁచిన దకదా! ౮౦

చ॥ ''గురు'' వని చెప్ప నందులకుఁ గోప మిదేమిటికిఁ పనుల్ యశ
స్కర మగునే?,, యటంటి వది సమ్మతమే! కొమరుల్ గలారు నీ
కరయఁగ వర్ధమాను లిటు లాచిరజీవులు నిన్నె నల్పన
స్ఫురణమునందు నీహృదయతాప మదెట్టిది యౌను తెల్పుమీ. ౮౧

క॥ గురునకుఁ* దండ్రికి భేదం, బరయంగా లేదు శిష్యుఁడనఁ? గొమరుండే
మెఱిఁగిన వారికి; వాఁడే, తిరస్కృతిన్ జూప మదికిఁ దెగులు గలుగదే. ౮౨

---

రవున్ ధైర్యప్రభా మేరువున్, గవితాసద్గురు వేంకయాభిధుని వక్కాణింతు నై కాలమున్ (ఇది తి॥శా॥ గారి మొదటికవిత్వము కుమారసంభవములోనిది.)

''సీ॥ తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి రెండు, భాషలలోఁ దత్కృతన్ గవి యయ్యె ననేకముల్ శతలేఖినీకవిత్వ, తంత్రముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యనఘుఁ గూడి, శ్రీశైలవరపురీభూపాలుఁడాంగ్లేయ భాషాప్రవీణుండు బహుకళాఢ్యు'' తే॥గీ॥ గంధరుఁ శతిశాంతుండు సరసుఁడును నగు, రామచంద్ర వేంకటకృష్ణరాయచంద్రు, నొద్ద బాధుఁడును గవియుమాన్యుండునై చె, లంగు తిరుపతిశాస్త్రి తెలుంగుఁ జేసె.

(బాలరామాయణ నాటకప్రథమాంకముచూ)

(ప్రస్తావికాభియుక్తోక్తులనుండి.)

*శ్లో॥ దశవిక్షనమా బంధు ర్దశబంధు స్సగోత్రజః, దశగోత్రసమా జ్ఞాతి ర్ద

క॥ ఇదిగాక నీవు చుట్టమ, వదియు విచారింపఁ బుత్రతాపాదకమే
గద! *"శా" ఱివ్రాసిన నీ, పదముల మగు లేఖ కలదు చదువుము దానిన్.

క॥ నీజనకు నాయనమ్మయు, నాజనకునితల్లి యొక్క నాయనకును నుం
డే జననికి జన్మించిన, రాజ నెఱుంగుదువా? మఱచితివా? గురునిబలెన్. ౨౪

ఉ॥ ఏ నలచర్లబ్రహ్మయమనీషియెడన్ గడుభక్తియున్ గృతం
బూనినవాఁడ నంచెఱుఁగు రాగ్యుఁడ వీ వది నమ్మ దేని నా
మానసమందు నున్నయది మాత్రము నమ్మక పోవు కాన నీ
శానుని సాక్షిగా వినుము సర్వము దెల్పెద నారహస్యమున్. ౨౫

ఉ॥ ఏ నలపీఠికాపురవరేంద్రుని చెంతను జేరి తన్నృపా
స్థానమునందు నుండుటకుఁ దద్దయుఁ గోరినవాఁడ నౌచు నీ
పైని నసూయఁ గొంటి నని పల్కుట దెల్పితి వీవు వ్రాఁతలో
నీనుడి నిక్కమే యగునె? నీవు నెఱుంగుదు నాదుభావమున్. ౨౬

ఉ॥ ఎందఱు రాజు లుండిరి! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియున్
విందుతనంబు గల్గినవివేకులు; వారలయొద్ద నుంటినే!
గందరగోళమైనమది గల్గినవాఁడ స్వతంత్రుఁడన్ జిదా
నందుఁడ నే శ్రీసుశాసకుని నాయకుఁగా వరియించి యుందునే. ౨౭

---

శుజ్ఞాతిపమో ఽనుజః, దశానుజనమా మాతా, దశమాతృసమః పితా, దశానాంచ పితౄణాంచ సద్గురు ర్జ్ఞానదోఽధికః, ... తస్మాత్సర్వ ప్రయత్నేన సదా సంపూజయేద్గురుం,,

పల్లిపాలెం

*బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులవారుగారి సముఖమునకు, ఓలేటి వెంకట్రామయ్య నమస్కారములు చేసి వ్రాయుశుభలేఖార్థములు ... శుభముహూర్తమునకు సకుటుంబపరివారముగా దయచేయగలందులకు ప్రార్థించుచున్నాడను... తమరు రచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒక్కొక్కటి చొప్పున పంపించగలందులకు ప్రార్థించుచున్నాను దయయుంచవలెను.

ఓ॥ వెంకట్రామయ్య

(చిరకాలము క్రింద రచింపఁబడి 1907 వసం॥ అచ్చయిన మా కామేశ్వరీ శతకము నుండి.)

సీ॥ నరనాథుల్ పలువుండి మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁ గాదు నీవంటి స

ఉ॥ అన్నము లేదొ? వస్త్రమునకై కొదవుండెనొ! యున్నదాని నే
మెన్నఁగ నెవ్వఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గాన రాఁడు నీ
యన్నముకోసమై మనమునందుఁ బ్రయత్నము దేల నాకు, నీ
చిన్నతనంపుమాటలకుఁ జేతము పొక్కెడి దుఃఖ మెక్కెడిన్.॥ ౮౮

ఉ॥ నిక్కముగాఁ బితాపురికి నేఁ జనుదెంచెడివాఁడ నేని ని
న్నక్కడఁగింపఁగా వలయునో! సరసాలుఁడు నిన్ను నన్ను నెం
దొక్కరుఁగూడ నేలుకొనఁడోటు! సమర్థత లేనివాఁడొ! నా
కక్కఱ యున్న దేనికడ కంతకు మున్ జనుదేర కుందునే.॥ ౮౯

ఉ॥ ఎందఱొ భార్యలుండియును నింకొకచాన స్వయంవరంబుగా
నందము పొల్చుజాణ తనకబ్బినఁ గైకొనరే నృపాలురు? రా
మందమునన్ మదీయకృతిచందనగంధిని గూడ మీనృపుం
డందఱతోటిపాటు తనయా? కొని యేలఁగ వచ్చు నచ్చుగన్. ౯౦

తే॥ గీ॥ ఏకపత్నీవ్రతముగూడ నిట్టిపట్టు, నందు రామాదులకుఁ బోలె నడ్డుపడదు
రాము పేరిట నెంచఁబడు ధీమహీశులు, తమకృతికుమారికల నిచ్చి తనియరయ్య?

ఉ॥ జంకెతి నందువో! యధిపుసన్నిధికిన్ దగ నందువో! తదీ
యాంకణమందు నొక్కఁడును నక్కటి? నాసరివాఁడు లేఁడె, "ని
శ్శంకఁ గాకి పంజరపుసత్కృతికిన్ దగ"దందువే! యెటుల్
గాంచెదు సర్వముం దెలిసి పుత్రిక! తండ్రికిఁ జేటు గూర్చెదే. ౯౨

చ॥ కడియములోనఁ గల్గుజనకాండము సర్వము నెన్నిమార్లు నన్
గడెగడె కానృపాలమణిఁ గాంచఁగ నేగు మటంచుఁ జెప్పి? రా
నొడు లవి నేను నూఁకొనియునున్ నృపుఁ జూడమికేమి హేతువో
కొడుక? యెఱుంగవే! యెఱిఁగి కొంకక "కాక" మటంచు గెల్కెదే. ౯౩

క॥ కడియమునకు దేనికి నై, వ్వడు సంబంధంబు గలదు పుత్రిక! నీయా
ట్పడమికి దేనికిఁ గలదె, క్కడిసంబంధంబు? చెప్పఁగలవే నాకున్.॥ ౯౪

---

టక్కరుకాశాలిని పెంపఁగాఁ బెరిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె యంబాదేవి కామేశ్వరీ. ౧౫

క॥ ఎందుకుఁ జన మానితిసూ, పొందుగ* మున్ను వ్రాసినాఁడ బొంకందువొ? లే
కందుల కొప్పుదువో? నా, కిందులకున్ జింత లేద యించుక యేనిన్.

క॥ ఎన్నో బూతులు దిట్టితి, వన్నియుఁ గోకిలవుఁగూఁత లనుకొనియెద నా
మన్నయభీష్టము దీర్చితి, వన్నా! "కాక" మన నేమి యదియు మదంబే.

తే॥ గీ॥ కడుపు నిండిన బేరమ్ము గాని నాకు, నేన్ప్రశాలునిఁజూడంగ నేమివలయు
నట్టిచోఁ మాన్ప్రశాలకుఁ దాఁకఁ దలని, నేలదర్శింప రాకుండ నెఱుఁగఁ జెప్పుము,

తే॥ ఎలమిఁ బిలిపించి న్యాయముగ నెంతొ పేర్మి, గారవించుచునుండెఁ సూరి గౌరినాథ
శాస్త్రి, సూరులున నుద్యోగసరణినుంచి, యతని విడివత్తునెట్టు లేన పులకవుర.

## (4) బందరు పర్వము.

క॥ గౌరీనాథ బుధుండనఁ, గా రాజోరి రడ్డొరి చెప్ప కాకమరి యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కర్మఠుఁడు సుతా.

---

*గీరతము 1వ భాగము ఇతిహాసపర్వము చూ.

శ్రీశ్రీ వేదమూర్తులైన శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి, జంధ్యాల గౌరీనాథశాస్త్రి అనేక నమస్కారములు... మీరుభయులున్నూ యిదివరకు ప్రతిసంవత్సరం అప్పుడప్పుడు సంస్థానములలోకి వెళ్లివస్తూ సంచారాభ్యాసంకలవారుగా నస్థాయిగా యేకత్రివుండడం దుష్కరంగా తోచునేమో అని పకరు అన్నారు అందుకు నేను కొంత సమాధానము చెప్పినాను ఇంతకు వెళ్లదగిన స్థలములు అయినవి మీకును సంచారమువల్ల విసుగు కలిగి వుండును పైగా వయస్సుకూడా వృద్ధియగుచున్నది ఇట్టిస్థితిలో స్థాయిగా విశేషప్రదేశమైన జీవనోపాధి యేకత్ర దొరికినప్పుడు అక్కడనేవుండిపోరిక కొలది గొప్పగ్రంథములుగాని పాండిత్యముతో చేరిన పురివకటి గాని చేస్తూ కాలక్షేపం చేయడమందు మీకు తాత్పర్యం వుండవచ్చునని నేను తలుస్తాను మీరుభయులలో నెవరో యొకరు యీ ఉపాధ్యాయస్థానమును అంగీకరించవలసినదని నా తాత్పర్యము ముందుముందు దేశసంచారముగా కాలయాపన చేయడం దుస్తరంగావుండును మీరు కావలసిన ప్రతిష్ఠను యిదివరకే పొందినారు కాబట్టి బాగా ఆలోచించి మీ జవాబు వెంటనే వ్రాయగోరుతాను వచ్చే అది

క॥ స్కూలుకళాశాలు మాత్రే బాలకు యత్నించి సభను సల్పియు మొకమొ
న్నేలాగు గౌరవించిరో!, బాలకి? పాత్రమ్ము నందుc బరియింతవాకో. ౧౦౦

క॥ బంద రన నిట్టి దక్కcడ "సందేహము లేదు భావశాబ్దికజీవుల్
చిందులు ద్రొక్కcc జనcగ గో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ.

క॥ బందరనcగ నిట్టిది యట, నెందటో యున్నార యెల్లయెడ విద్వాంసుల్
తందర పడునవధానుల, చిందు లచట సాగి రావు శిష్యుcడ? వింటే. ౧౦౨

క॥ బందరనcగ నెట్టిది యని, "సందేహము లేదు భావశాబ్దికజీవా
నందుని బోలెడు శ్రీరామమ్ముం దగ సుకవూ అడిగి సమూల పెంపుc సుమీ. ౧౦౩

క॥ బందరులోc గోకిలకవి, చందిరులకు భిన్నమైన సాగదు కాకం
బుం దిలకింతురు కపటపు, బొందలయత్యద్భుతములు పొసcగవు సుమ్మా.

క॥ బందరున కె యొకపరి మీ, "సందేహము లేదు భావశాబ్దికజీవా"
నందుని నే రమ్మంటిని, జిందులు సాcగవని యటకుc జేరcదు వినుమీ. ౧౦౫

క॥ అప్పటికిc జిలుక కాలే, దెప్పుడు పంజర మనcగ నెట్టిదొ యొఱుcగం
డిప్ప డొకసారి యడుగుము, చెప్ప నతcడు ధారణావిశేషము కలిమిన్.

క॥ ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద వచ్చునేమొ? కృష్ణకవీంద్రా
దప్పక ప్రేరేపింపుము, చెప్పము నరపాలుc డేల నెల వీcడు! సుతా. ౧౦౭

క॥ సంగస్నాగారు వీణా, శృంగారవతీవినోదచేష్టాకృష్ట
త్వంగులు తత్సభాంగా, లింగితులై యెటకునేని లేదే పనుటల్. ౧౦౮

తే॥ గీ॥ ఒక్కcసంస్థానమందు మీయునికి కేమి, ఏటిపోలిక వారికి నెందు మీకు?

---

వారం లెక్కి మీటింగు చేసి యెవరినో ఒకరిని హెడ్మాస్టరుఅప్పాయింటు చేయవలసి వున్నది రేపుస్కూలు ఆరంభము గాన అంతకంటె విళంబము చేయజాలము త్వరగాజవాబుపంపించకోరుతాను మీయిరువురిలో యెవరుఅంగీకరించితే వారు హిందూహైస్కూలు కమిటీవారిపేర ఒక దరఖాస్తుకూడా వ్రాసినాపేరపంపకోరుతాను మీజవాబురాకపోతేయీఆదివారంనాడు దాటజాలను, చిత్తగించవలెను

జంధ్యాలగౌరీనాధశాస్త్రి

అక్కటా! *వీణరూపంబునఁదుగఁ బాడు, చేసినది చూచి నేనెంతో సిగ్గువడితి.

క॥ ఈసిగ్గున కేమయ్యెడఁ, జేసిన యవధానమందుఁ జెప్పిన కవనం
బే సరసముగాఁ బడినదొ, యా సర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్.

క॥ అనరవతికిని మనయవధానులు గంధ లనఁ గీర్తి దవులు నదియుఁ గా
కే నాఁడు నాజ్ఞ గొని వి ద్యానిధు లెక్కడికిఁ గాని యరుగుట లేదే. ౧౧

క॥ ఇది యిటులుంతము బందరు, వద నెట్టిదొ రామశాస్త్రిఁ బరమాద్భుతవుం
బదము గలశతవధానిం, గదిసి యడిగి తెలిసికొన సకలమును దెలుపున్.

క॥ అప్పుండితు నవధానము, నప్పుడు జడ్జీ కలెక్టరాదుల సభలో
నొప్పరి సూ! బార్ నీ! యనఁ, దెప్పె పెయాని యొకసమ్మును పెట్టె నడుగుమీ.

క॥ ఇది యతిస్తుత మతఁడును, వదయత నినుఁ బోలెఁ గాక తక్కఁగఁ గొన్నా
ళ్లాదిగెం గాకము కడబ, ల్లిదుఁ డగు మీకృష్ణ సుకవి లీలన్ హేలన్.

---

## (౮) సమృద్ధిపర్వము.

---

క॥ ఇఁకఁ బ్రికృతము వినుమయ్యా, పికరాజము! వెనుకఁ బోలెఁ బృథివీపతులన్
సక సక లాడెడి పొట్టకుఁ, గకవికఁ గనుఁగొను ప్రసక్తి కలుగదు సుమ్మా.

ఉ॥ పొట్టలు మూడు మావి, సరిపోవును బుట్టెలు మూడు మాకు; ని
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదో కొ, నీ
కెట్టులు దోఁచె! లోకు లిది యెట్టులు నమ్మెద రంచు వ్రాసి తీ
చెట్టతలంపు మాటు! యిటు చెప్పుట పాపము కాదె పుత్రకా. ౧౮

---

(వెంకటరామకృష్ణగ్రంథమాల 74వ పుట నుండి.)

*వీణాస్వరూపము, కందము

క॥ వీణాస్వరూపమొప్పఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికులనతి నుతింపఁగ, వాణియె యనమానురాలు వసుధాధీశా

(వంగమేశ్వరశాస్త్రి.) గారుకోరినది.

చ॥ నెల కొకసారి రూపికలు నీదయ కల్మి "కసీనపక్షు" మొ
వ్వ లొలుకు నాదుపుస్తకపుఁబుత్త్రిలు దెచ్చి యొసంగువారు పై
నెలమిని రోజు కొక్కొకటి యిత్తురు రూపిక సూఁకలులోన నెం
దుల కిఁక దేవిరింతవ లెనో? ననుఁ గోరని తెండ్ల సన్నిధిన్. ౧౧౭

ఉ॥ ఎక్కడి కేగ పూరకయ యింటనె యుంద మటన్నఁ గాని నా
కెక్కడినుండియో సభల కెన్నియొ *జాబులు వచ్చుచుండు నం
దొక్కసభన్ బొనర్చినను నొక్కశతానకుఁ జొవు లేదు నీ
కెక్కడియూహ వుట్టెనొ నిది యెవ్వరి కిత్తును తెల్పు పుత్త్రికా. ౧౧౮

---

ది 30-1-10 ఆటపాక పోస్టు కృష్ణాడిస్ట్రిక్టు

*విధేయుబందాశ్రీశయిలంకృతానేకశరస్సాష్టాంగనమస్కృతులు. . తమతా పునుంచి V. P. P. గా రాబడిన నానారాజసందర్శనము శనగ్రహాముసు చదివి మిగుల ఆనందమును పొందినాను తమకీర్తిని యిదివరకేవినియున్నందున్న యప్పుడు తమ దరిశనంచేసితమవల్ల చేయబడు శతావధాన అష్టావధానములు కాంచవ గునా అనిమనస్సులో యోచించుకొనుచుండగా తమరుపంపించిన పుస్తుకములలో నానా రాజసంవర్శనమునొక్క 10 పేజీలో 3పద్యమును 11 పేజీలోని 8పద్య మును చదివిన దాది నాయాశమరింత వృద్ధి యగుచున్నది గాని ... తమరునం పూర్ణవిద్యామంతులని యెరిగివుండిన్ని తమవల్న జరుపబడుఅష్టావ ధానశతావధా నములయొక్క కష్టము తెలిసి వుండిన్ని అవి తమవల్లజర్పబడిన పిమ్మట తమకున రియయ్యె మన్నన రాజలోకమువల్ల జరుగవలయునేగాని మాబోట్లు యేమిచేయ గలము అనేభయము ముందుగా కలుగుచున్నది అయితే చంద్రునకు నూలుపో గను సామెత ప్రకారం మాయొక్క శక్తిని గనిపెట్టితమవంటి మహానీయులు య ట్లయినను మాకోరికతీర్చుడమె ముఖ్యముగాఆలోచించవలశిన దయివున్నది యింత యందుకనియెదరా? ఆశాభంగము చేయుట న్యాయము కాదుగనుక బందరువచ్చివి నకూడదనియెదరా? నావక్కనికే బందరువచ్చివినుటకు సాధ్యమగునుగాని యిం కాకొందరు కూడా ఆశాబద్ధులయి వున్నందున రావీలుకాదనినావుద్దేశ్యం గనుక నామ్నవినంపూర్ణదయతో అంగీకరించి యెప్పుడయినను దరిశనమిచ్చి నాగృహ పావనమయ్యేలాగు యీబీదవానిను -- కు విజయం చేసి కొర్కెనుతీర్చగలందులకు ప్రార్థించుచున్నాను సర్వజ్ఞులయిన తమకు నేను వ్రాయునంతటి బాధను కాన

ఉ॥ ఇంతటి దనర వ్రాసికొనుటే విషయమ్ము స్వకీయ [illegible]
గొంతదానంగు, దాత, నని కూడ లిఖించుట యొట్టు లోపృగా

---

ని తెలిసియుండిన్ని వ్రాశినయీలోపమునుమన్నించి తిరుగుజవాబు దయచేయవేడు కొనుచున్నాను, దివ్యచిత్తము కేవలెను. శేవక్డు బందా శ్రీశయిలం.

---

సే॥ పంద్రంగి రామారావు అనేకనమస్కారములుచేసి చేయంగలవిన్నపములు . . .వెనుక నేనుమనవిచేసుకొన్నప్పుడు తమరుశతావధానం చేసెదమని సెలవుయిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు ఇప్పుడుతిరిగి యిక్కడకాలేజీ విద్యార్థులు చాలామంది తమశతావధానము నేచూచి సంతోషించవలెనని అతి కుతూహలము గానున్నారు పట్టాభిషేకమునకు మాకు డిశంబరు 7వ తారీఖునసుంచి వారంరోజాలు శలవులువచ్చుచున్నవి గనుక అప్పుడు యీ కార్యము జరిగించగలందులకు మాఅందరిప్రార్థన అయియున్నది ఈవిషయమైయిప్పుడు తిరుపతి శాస్త్రులవారిదగ్గరకు వెళ్లి వారిఅనుమతినిపొందినాము వారుతమఅభిప్రాయముకూడా కనుగొండమని శెలవుయిచ్చినారు కాబట్టి మాయందుదయవుంచి మాప్రార్థన కనుకూలమగు జవాబు తిరుగు టపాలో వ్రాయగలందులకు గోరుచున్నాము.

చిత్తగించవలెను

పిఠాపురం రాజవారి
కాలేజీహాస్టలు
కాకినాడ

తమవిధేయుండు
పండ్రింగి రామారావు
27—11—11

ఇక్కడకాకినాడలోస్టూడెంట్సు అవధానముచేయించెదమని అడుగుచున్నారు మీకును వ్రాయుదురు మీఅభిప్రాయము చెప్పుడు.... ది॥ తి॥

V. V. SUBBARAU, B. A., B. L., గుంటూరు.

12 ఆగస్టు 1911,

...కర్ణాకర్ణి వినియుండి మిమ్ములను ప్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రులగారువహా మీరు వస్తారనునమ్మకముతో నిచ్చట నీనెల 19, 20 తేదీలను తమరుభయులును శతావధానము సల్పుటకు నేర్పాటు చేసినారము గాన మీరు దప్పక 18 తేదీకే దయచేసి మమ్ము నానందింప జేయ మిక్కిలిగా బ్రార్థించుచున్నాము.

సంత యుదారతాగరిమ యంటనిశిష్యులు బ్రహ్మశాస్త్రిన
తాంత్రింతర భోక్తలందుఁ గల రంచనుకోకు కుమారి చెప్పితిన్. ౧౧౯

## (6) బ్రహ్మగురుపద్యము.

ఉ॥ అమ్మహనీయుపేరహరహమ్మును నీవును బావయాన్ జప
మ్మిమ్ముగఁ జేయుచోఁ గృతము నీగతిఁ జేసిన పాపమెల్లనున్
నమ్మయి పోవు నట్లొ నరుడన్ బ్రియతింపుము రామదేవుపా
దమ్ములు వొల్చు క్షేత్రమునఁ దానమొనర్చి పొనర్పు మికిియన్. ౧౨౦

---

తిరుపతి శాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పక వత్తురని నమ్మకముతో కొన్ని ప్రయత్నములును జేసియున్నారము. కావున తమరు తప్పక రావలయును. చిత్తగించవలయును.

ఇట్లు విధేయులు

రంగావఝ్ఝుల హనుమయ్య
(జిల్లాకోర్టుప్లీడరు.)

వేలమూరి వెంకటసుబ్బారావు,
జిల్లాకోర్టు శిరస్తాదారు.

గుంటూరు. 15-8-1911

...రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రమములఁ దీసికొనిపోవలయునని కుతూహల పడుచున్నారు. గనుక తాముభయులు సమకాలముననే వత్తురని యెంతును.

శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

....తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని ప్రత్యుత్తరము చేరలేదు. మరచినారనితోచెడిని. తమరు రేపుసాయంత్రము బయలుదేరి యిల్లుండి గుంటూరికి చేరెదరని వుత్తరము వచ్చినట్టు తెలిసినది. తమరు శ్రీతిరుపతిశాస్త్రిగారు ఒకసారిగా గుంటూరుకు దయచేసిన యెడల వుత్సవరూపకముగా గ్రామములోకి తమరిని తీసుకరావలయునని నాకోరిక. దీనిచేతనే యీసాయంత్రము శ్రీహనుమచ్ఛాస్త్రిగారిని యీవిషయమై తమకు వ్రాయమంటిని. శుక్రవారము సాయంత్రముకు బెజవాడరయిలు స్టేషన్ వద్ద నత్రిమువద్దకు తమరుదయచేసిన యెడల నేను శ్రీతిరుప

చ॥ ధవళగిరిన్ మహామహుఁ డతం డొకసత్రము వెట్టి శిష్యులన్
గవులను జేయుచున్ సుఖముగా మఱి వారికి నర్థికోటికిన్
బ్రవిమల మన్నదానము నపారముగా నొనరించెఁ దద్గురున్
దవిలిన శిష్యుఁ డించుక యుదారత నేర్పు టదేమి లెక్కయా. ౧౨౧

ఉ॥ అమ్మహనీయునింట నెల యయ్యెడు నంతకు నొక్క పుట్టెడి
య్యమ్మ సుమారు వారుఁ దమదైన కుటుంబము గాక శిష్యసం
ఘ మ్మతిథివ్రజమ్మును సుఖమ్ముగ భోజన మాచరింపఁ బ
ల్యమ్మున బ్రహ్మపండితుని కన్న మఱొక్కని కెన్న నున్నదే. ౧౨౨

ఉ॥ ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి, దాని కె
న్నెన్నియొ రోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించు దానిలోఁ

---

తిశాస్త్రిగారు కలసి అందరము శనివారము ఉదయము గుంటూరు చేరుదము. గుంటూరు స్టేషనువద్ద స్నేహితులందఱు తమరాకకు యెదురు చూచుచుందురు గనుక యీప్రకారము చేయుదురని ప్రార్థిక. గుంటూరు. 15-8-11

మజుందారు వెంకటహనుమంతరావు.

---

...తామున్నా ఆరోజుకు యిచ్చటికి దయచేసి సభ జరుపగలందులకు మిక్కిలి వేడుకగలవారమై యున్నారము.

ఇట్లు విధేయుడు,

15-9-1911.

తూములూరి కోటయ్య,

పినపాడు, మారీసుపేటపోస్టు.

---

గుంటూరు.

4-11-11

...12-12-11 అద్దంకిలో అవధానమట వత్తురా? సత్తెనపల్లికి వచ్చే ఆదివారం రాగలరా? ..

రంగావఝ్ఝులహనుమయ్య.

---

ఇట్టి యాహ్వానపు టుత్తరములు కొల్లలు గాని గ్రంథ విస్తరభీతిచేత నేమి చావస్తులనుకొందురనియేమి, యింతతో విరమింపఁ బడుచున్నవి.

విన్నది గాక తా రయితు దెచ్చి యొనంగుఫల మ్మదెంత హా
చ్చున్నను వీరికొక్క నెల రూకనొ? రూకదా నందియ మ్మగున్, ౧౨౩

కం॥ ఆయన ఘాత్ముని భార్యగ, దా? యిల్లాలనఁగ నాఖ్య యన నేల? నిజం
బే యన్నపూర్ణ యాపె వృ, థా యింతురె యట్టి పేరు తజ్ఞులు పెద్దల్. ౧౨౪

ఉ॥ చెన్నఁటి చూపు చూచి యొకశిష్యుని నేనియు నేమిరా! యటం
చు న్నిరసించి పల్క దిది చోద్యము, దేశికభార్య లిట్టివా
రున్నది వింటిమో? మఱియు నొక్కటి, లోకులు తన్నుఁ దిట్టినన్
సన్నుతిఁ జేసినన్ సమము సాటి మఱెవ్వరు? బ్రహ్మరాణికిన్. ౧౨౫

ఉ॥ "జాతకచర్య,,యందు గురుసంతతిఁ దెల్పెడువట్ల వీరివి
ఖ్యాతిని విస్తరించితిని నక్కడఁ జూడఁ గలాఁడ వందులోఁ
బాతకహారి తచ్చరిత పాఠము నీకును నాకు భావకుం
బ్రాఁతదానంగులన్ దొలిచి భద్రములన్ గలిగింప నెత్తిరిన్. ౧౨౬

శా॥ ఏనే కాదు మఱొక్క శిష్యుఁడును మాయీసద్గురుబ్రహ్మవి
ద్యానాథున్ సురభాషలోఁ దెలిపి కార్త్స్న్యశుభారావహా
ధీనానూనవచస్కృతిన్ బరఁగెఁ దద్దివ్యవచోధార, ని
త్యానందాత్ముఁడు సద్గురూత్తముఁడు,ని న్నత్యంతమున్ బ్రోచుతన్. ౧౨౭

ఉ॥ ఎంతటి పాపమేని రచియించును గాక కృతఘ్నుఁడై బుధా
స్వాంతు గురూత్తమున్ దెగడి వర్తిలుఁగా కలచర్ల బ్రహ్మవా
కాంతుచరిత్రమున్ జదివి కాఁగలఁ డుత్తముఁడంచు నెంచు మ
త్స్వాంతము, తచ్చరిత్రము కృతఘ్నుఁ గృతజ్ఞు నొనర్పఁ జాలదో. ౧౨౮

కం॥ ఆచరిత వ్రాసినతఁడును, నాచినతండ్రి కొమరుఁడును నాకడఁ దిర్వ
త్త్యాచార్యు నొద్ద శిష్యత, నూఁచి పిదప బ్రహ్మసేవనూఁచి రెఱుఁగు మీ.

కం॥ కాననతండు సతీర్థ్యుఁడు, మానిజశిష్యుండునగుట మాకడకల*బ్ర
హ్మనూన చరిత నంపెను, దీనిని ముద్రింపుఁ డని విధేయతకలిమిన్. ౧౩౦

---

*శ్రీచర్ల బ్రహ్మగురువరచరిత్ర సంగ్రహము.

...శ్లో॥ విద్యావానగృహాం పరోపకరణోత్పత్తిస్థలం సత్కృపో। పఘ్నం పుంజిత
సత్త్వ మున్నతయశఃకాయం ప్రతిష్ఠాలయం। రాజత్సద్గుణతత్పరోహణగిరిం ధర్త

చ॥ అలచరితంబునీపుశుభపావని కెంతయుఁ జాలునంచు ని
ష్ఠులఁ గొనికొంత యియ్యెడల ముద్రితముం బొనరించువాఁడ రూ

---

స్వరూప మ్మృదా। విద్వద్బృన్దవతంస మాత్మని భజే బ్రహ్మణ్యవిద్యాగురుం॥ 3॥
శ్లో॥యచ్చాకృత్య మనుష్ఠితం యదనృతం ప్రోక్తం యదంహః కృతం। వాక్చి
త్తావయవై ర్విసర్గఖలసంసర్గప్రమాదాదిభిః। వక్ష్యే బ్రహ్మగురోః పవిత్రచరితంత
త్పావవిచ్ఛిత్తయే। నాऽన్యస్యాస్య దధికో గురో రితి ఖలుజ్ఞానప్రదాతా యతః॥4॥
...శ్లో॥గోదావరీమండలరాజమానో నీలక్ష భగ్రామవర (కతియెద్దు) శ్చకాస్తి।
ఆరాచ్య విద్యాధరతీర్థవర్యా, దత్రాऽవిరాసీ ద్భగవాన్ కుమారః॥ 7॥
శ్లో॥ద్విజ స్తస్మి న్నేకోऽ వన దుతవనదారిడవరః। ప్రసిద్ధో వీరాఖ్యో జనిముపగతో
లోహితకులే। లసచ్ఛర్లోపాఖ్యో నియమితమనా స్వం చ్యుచిరపి। హరిద్రాలోకేకుర్వ
న్దినకరనతీ ర్భక్తికలితః॥ 8॥శ్లో॥ప్రాణాంభోసిధిరంధ్రవారిధిమితే వర్షే ప్యతీతేసు
న। శ్యామకల్యాదిచ శాలివాహనశకే షట్పాస్త్రిహానీందుపు। క్రోధ్యబ్దేచ సహస్య
మాస్యధవకే పక్షే తృతీయే తిథౌ। జజ్ఞే తస్య చతుర్థసూను రిహాచాऽముత్రాऽ
ర్థసంసాధకః॥ 9॥ శ్లో॥ఛాత్రాణా ముపబృంహణా దుతలసద్ధర్మస్యపుణ్యస్య వా। వి
ద్యాయా అథవా నచే దధిగతబ్రహ్మైకభావస్థితేః। యద్వాऽశేషజనోపకారక
కలాశాలాదినిర్మాణతో। బ్రహ్మేత్యుత్తమనామ సార్థకతయా పిత్రాऽస్య నిర్ధా
రితం॥ 10॥ ...శ్లో॥వారాణసీం। జిగమిషుః పరిశిష్టశాస్త్రః। పాఠాయ భూసురవర
స్య గురోరనుజ్ఞాం। లబ్ధ్వాతికౌతుకయుత స్తదను ప్రతస్థే। పౌరైస్సతీర్థ్యనివహై
రపిభావ్యమానః...శ్లో॥ ఏవం పరత్రాऽత్ర సుఖైకహేతుం। వారాణసీం ప్ర
ప్తవరో వివేశ। దేశాచ్చ దేశం విచరన్ జవేన। విశ్వేశగఙ్గాబుధదర్శనేచ్ఛుః॥3॥॥
....శ్లో॥కాశీనాథబుధో హి యద్గురువరః కాశ్యాంపశిష్టాయితో। యచ్ఛిష్యస్యక
ర్థవిద్గురుయశా శ్రీబాలశాస్త్రీ మహాన్। ఏవం శ్రీహరిశాస్త్రినుత్తమగుణో వ్యా
కార్థవాన్ద్రీకరః। కాశ్యాంభూపనిషేవితో వ్యజయత శ్రీరాజరామో బుధః॥ 34॥
శ్లో॥సంఖ్యావత స్తస్య పటు స్స సన్నిధౌ। వ్యాఖ్యానకోశాన్ పఠితుం ప్రచ
క్రమే। సఖ్యాదృతస్స న్విబుధేంద్రమండలీ।ప్రఖ్యాతకీర్తిః కలితః కలాగుణైః॥
35॥ ... శ్లో॥అత్రైవ స్త్రిజనపాజేన పత్రికాऽస్య। దాహూతః పరిణయ
మస్య కర్తు మారాత్। గుర్వాశీర్గణపతిపూజయా స్తదాత్వే। ప్రత్యక్షం ఫలమివ
దర్శితం జనానాం॥ 41॥ ...శ్లో॥ఇతి షోడశవాసరా నుషిత్వా। నిజగేహే స్వవివా

ష్యులు గురుపట్ల నిట్లుసుమి కొందఱు శిష్యులు వ్రాయువారైరి; లే
ఖలుఁ దును పాడువారైరి కలరు గా దిగఁ డం చిది చెప్ప సువ్వగ౯. ౧౩౦

---

హ సంభ్రమేణ। నిజసోదరదుర్గతం డితేన। ప్రతిగ స్తం ఖలు నిశ్చితాయ కాశీం॥ 52॥ ...శ్లో॥షట్సు శాస్త్రేషు షడంగేషు షడ్భాషా షణ్మతేషు చ। ప్రజ్ఞా యస్య స్థితా తస్మై బ్రహ్మతంత్రాయణయే నమః॥ 61॥...శ్లో॥ఇత్థ మేవ నృత సన్నిధౌ బుధైః శ్శాస్త్రపుష్ట పరీక్షితో భవన్। శ్లాఘితో బహుమతస్సభాస్థలే। నిర్జగామ బుధనిర్జయాయ సః॥ 67॥ శ్లో॥ అయోధ్యామధురాక్షేత్ర నేపాలగంగోత్తరా న్వైద్యనాథం జగన్నాథతీర్థం హరిద్వార కేదార బృందావనాద్యం। మహాక్షేత్రజాతం నిషేవే సుధీరాట్॥ 68॥ ...శ్లో॥దూరేణ కాలనియమేన బహుద్విజానాం। కోలాహలేన నియతాశన భోజనేన నతేప్రమ భుక్తి రధికశ్రమకారిణీతి। జ్ఞాత్వైవ శిష్యనివహాయ దదాతి చాన్నమ్॥ 72॥...శ్లో॥ఇతి జగదుపకారస్య। ప్రతిపద మఖిలైస్తు నుత్యమానస్య। పరిణామశూల బాధా ఽపరిణతవయసోఽపి దేశసంచారాత్॥ 78॥...శ్లో॥ శనకై రగమద్విద్వాం త్స్వగ్రామం "సుకడియద్ద", నామానం। శ్రీరామో వనవాసాదివ సాకేతం నృణాం ప్రమోదేన॥ 97॥ ...శ్లో॥ స్వస్యాలకః పరితు మారభతాఽగమం యః। శాస్త్రాణి పాఠయతి శిష్యగణం స్వవశ్యాత్। విద్యార్థినాం తిరుపతిః కవివేంకటేశో। యా తౌచ యా కవితయా గురుకీర్తిసాంద్రా॥ 101॥ శ్లో॥ కింను తచ్ఛాత్రనామాఖ్యా యా స్యాత్ఫలం। తస్య సంఖ్యా మతీతాగతా ఛాత్రితాం। చిత్ర మేత న్మహాత్రే ష్వస్మైకోఽపివా। ప్రాకృతోఽపండితో నాఽభవత్పశ్యత॥102॥ ...శ్లో॥మహానద్యా రోధశ్చరపరిచరియా పత్రిచ మహా। నదీతీరే వాసం మనసికలయ న్పండితవరః సహచ్ఛాత్రై ర్గౌతమ్యఘహరతటే వస్తు మనసా। నిజగ్రామా ద్వాసం ధవళగిరి పాదే ష్వలభత॥ 105॥...శ్లో॥ న కేవలం ఛాత్రగణాయ భోజనం। దదాతి పాంథా వశయేచ సన్తతం। తత స్తదీయం సదనం సమీర్యతే।న పాకశాలేతి న సత్ర మిత్యపి॥ 107॥ శ్లో॥రాత్రౌ త్రియామా సమయే ప్రబుద్ధః। క్రమేణ శిష్యానఖిలాన్ప్రబోధ్య। శాస్త్రాణి సంపాఠయితుం ప్రవృత్తః। స్నాపయే ద్ద్వాదశఘంటికాన్తే॥ 108॥ శ్లో॥ వ్యాఖ్యానేషు సుపాఠయన్ప్రథమతస్తద్వాక్యపాఠాం ఛాత్రపయే, త్పశ్చాత్తానపి పాఠయం స్తదధికాం త్సంశ్రావయే ద్బోధకృత్। ఏవం సర్వకలార్థినాం క్రమవశా త్పాఠాం త్సమాప్య స్వయం, మధ్యాహ్నే దథ తా న్పరస్పరమహో హా హా సువ్వన శ్చింతయేత్॥ 109॥ శ్లో॥చిత్రం కేచన కావ్యనాటకమహాలంకారచ

మ॥ గుఢశక్తిన్ బరతు బ్రచారనిరత శ్రీరామనీపాల సం
హారణప్రాప్త యశోభిశోభి జమదగ్న్యత్వోద్భవున్ దెల్పు నా

---

మూర్ధ్వాముఖః। గ్రన్థాన్ స్వకీయకశిష్యవర్గసవిధే సమ్యక్ప్రశస్తోఽనిశం। సాహిత్యప్రచురాన్తత స్సవినయం బ్రహ్మాఖ్యసూర్యన్తికే। శ్రీమద్వ్యాకృతి మధ్యగీష్పతి కిమప్యస్య సాన్త్రతకళాకాంక్షిణాం॥ 110॥ శ్లో॥ యాదృక్ప్రేమగురోః స్వశిష్యనివహే గుర్వ్యాస్తతో ప్యన్యతం, ఖ్యాతైః కిం సుతనిర్విశేషమపి తౌ సంపశ్యతో జంపతీ, దూరే బంధుజనా న్విహాయ పితరౌ దేశం చ విద్యార్థినాం, బాలానాం కిము సౌఖ్య మస్తి గురునతాంకురుణ్యతోఽన్య ద్భువి॥ 111॥ శ్లో॥ శ్రీకాశీసంప్రదాయానుభవ మనుసృతస్తత్రవిద్వద్వరిష్ఠో, వర్షేవర్షే స్వశిష్యైర్గణపతినవరాత్రోత్సవం కారయిత్వా, భూరిద్రవ్యవ్యయేఽపి స్వయ మధికయశోభాజనం సన్మహాత్మా, కాశీతోఽప్యన్న దానం సమధిక మితిసంశ్లాఘితో బోధవీథి॥ 114॥ శ్లో॥ దానం కలావమృతి సాధన మిత్యవోచన్, దానే ష్వనుత్తమమిలిన్మృత మన్న దానం, ప్రత్యక్షభూతపరితృప్తి నిదానభూత, మిత్యన్నవాహం వరిత నూత్యమితాన్న దానమ్॥ 115॥ శ్లో॥ ద్విజో భూత్వా కిం స్వాత్ఫలమిహ నచే చ్ఛాస్త్రపఠనం, నశాస్త్రేణా స్త్యర్థో న యది పరసంబోధనగతిః తయా నా వ్యస్త్యర్థో యది న సదనుష్ఠానపరతా, పరం తత్వా సాఽపి ప్రకృతపి శేఽస్మి న్విలసతి॥ 116॥ శ్లో॥ నిస్స్వానవస్యగరికా నితరాం స్విజాతీ, స్వవిద్యార్థినశ్చ కృతదారపరిగ్రహాంత్స॥ కాశ్యామివ ద్విజసమస్కరితాప్రదాన, లబ్ధాతిదోషహారణాయ కరోతి విద్వాన్॥ 117॥ శ్లో॥ మధ్యే మధ్యే కేనచి ద్దైవినాఽయం। భక్త్యైవరోఽప్యజ్ఞైర్లబ్ధసత్కై రన్నదానం। భూదేవానాం సంభ్రమాత్యంతసూతి। ప్రాజ్ఞస్యాఽస్తే భూతతృప్తేః పరం కిమ్॥ 125॥ శ్లో॥ అశాశ్వతో దేహ ఇతి ప్రసిద్ధం, భూయాత్స్వరే యమ్మమహారశాలా, ఇతీవ మత్వాస్థిరజీవనార్థం, స్థిరాం సమార్జ్య స్థిరకీర్తిరాసీత్॥ 126॥ శ్లో॥ చిరం ద్వాదశవాసరేషు మిళితాన్ గోదావరీపుష్కర, స్నానార్థం ప్రతిపజ్క్తి చోపదిశతో విప్రాం తృప్యాన్, సాధకాన్, నాఽనోచ్యశ్రీహమునన్నఠం ధన మయం సంపాద్య భక్త్యాదభి, స్సర్తిర్వాప్య ధిక పుణ్య మావ భువి కిం దృష్టిః క్వచి త్తత్సమః॥ 127॥ శ్లో॥ వికారినామాఽప్యతి కావకాలే, సమాగతషట్త్రింశహస్రతోఽబ్దః, పుణ్యో వ్యయం బ్రహ్మగురో రతీవ ఽ, సహిష్ణునాజ్ఞప్త ఇవాబ్జజే॥ 129॥ శ్లో॥ భూదేవాయుతతర్పణం దశదినైర్గోదావరీతీర్థోజ్జ్వల, తోర్వూర్వారాఖ్యపురేఽప్తి ప్రవిలసచ్ఛ్రీకోటిలింగస్థలే. క్షేత్రే పాదగయాహ్వయేఽపిచ నిజశ్వ

కరరే? యిట్టిఁడ వెట్లు శిష్యుఁ డయి కోరి యంతేవసద్ధర్మసు
స్మరణోపజ్ఞదురుదగ్రమక్వథితధీరవాత్రిత చేతోంబుజా. ౧౩౧

మ॥ గురుభక్తిప్రథితుల్ మహామహు లనేకుల్ సర్వలోకైక దు
స్తరగవిస్తారిత నిస్తులైన సనితాంతధ్వాంత నిర్మూలనా
పరభాస్వత్త్వ భాస్కరుల్ పొలుచు నికాలంబునన్ నాకు నీ
వరరే? శిష్యుఁడ వెట్లులైతివొ కదా? యాచార్యనిందావహా.

తామ్రపుర్యాం తథా, కర్తుం బ్రహ్మసుధీ రియేష జగతః క్షేమాయ కామాయచ॥ 130॥ శ్లో॥ నవగ్రహ జపగ్రహ ప్రభు నమస్క్రియా వేదన, త్రిపురాణపర నాధి స్వవని గోపద క్షేత్రికే, సుతర్పయితు మన్నతో దినసహస్రవిప్రోత్తమా నుపాకల్పిత బాహుళ ప్రథమనాసరే పండితః॥ 131॥ శ్లో॥ జగత్ప్రణయతో బత ప్రవిగతా జగత్క్షేమకృ, ద్రుహోత్థ మవినాశనే జగదుపప్లవ స్స్యాదితి, తదష్టమదినే బుధం జ్వరగణేన సంపీడితం, కృపావిరహితా ముహురుపస్థు రకార్షు రుగ్రగ్రహాః 132॥ శ్లో॥ శమ్యాం కృతార్థస్థితౌ బ్రహ్మవిద్యానుపశ్యా ద్వ్యష్టమాసాదిశాన్తిం సమాప్య, సుభక్తేషు శిష్యేషు పశ్యత్సు తుష్యన్। పరిత్యజ్య దేహం గతో బ్రహ్మైక్యం॥ 133॥ శ్లో॥ దివంగతే బ్రహ్మబుధే ధరాఽసీ త్వనాథహీనా బత ధర్మశూన్యా, కలార్థివర్గో విఫలో బభూవ। క్షుధాతురః పాన్థగణ స్తదాఽసీత్॥ 134॥... శ్లో॥ తత్పాణ్డలః పతితాగమ స్సుగుణథా, శ్రీవిశ్వనాథో బుధః స్థిత్వా తత్రిత దార్జితావనిఫలై స్స్వాశ్రితై స్స్వతంత్రైః. విద్యార్థిప్రకరం యథాకథ మథో తత్పాఠశాలాగతం, విద్యాబుద్ధియుతం కరోతి హి గురో ర్గవ్యత్వమాపాదయన్॥ 136 శ్లో॥ వేమూర్యపాఖ్యనరసింహ కృతం సభక్తి, శ్రీబ్రహ్మపండితచరిత్రమిదం పవిత్రం, యావద్దివాకరనిశాకరతారకాణి స్థాప జగన్ము ఖ్యఖుయుతా మనుజా భవేయుః॥ 137॥ శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

(శ్రీగురుబ్రహ్మైక్యమునుగూర్చి మేము చెప్పినది.)

మ॥ కలిమానం బాకయైదువే లరుగ నేకత్రస్థసప్తగ్రహా, మ్మలఘున్ శాంతి సునర్ప్పుచున్ శ్రమ లవన్మున్ లేకయే బ్రహ్మమున్ గలిసెన్, బ్రహ్మగురూత్తముండు దశమిన్ గంజాప్తవారంబునన్, ఖలసంచారి వికారి కార్తికపళక్ష శికపక్షమునన్,

తి॥ వెం॥

మ॥ ఒకఁడుఁ గన్పఁడఁ డిట్టియాకలిని నీ కోశిష్యు! తుల్యుండు పా
య మహాధ్యాయునిఁ గొల్వకున్న నతఁ డత్యంతమ్ము పాపాత్ముఁ డం
చకటా! వ్రానెడియంత సాహసి; మదీయాఘప్రభావంబె నిన్
వికలాత్ముం బొనరింపఁబోలునుజుమీ! వేత్తృత్వసత్త్వాఖనీ. ౧౩౩

శా॥ నీమున్ జిక్కిన యీకృతఘ్నతను నేనే నేర్పినట్లే మదిన్
లోకుల్ వాకొనువార లేమొ! యని లోలోఁ జింత నేఁ గాంతు వి
ద్యాకల్పద్రుమ మన్మదీయగురు లేతన్నింద రాకుండ నా
పాకం బేర్పడఁగా వచించి ననుఁ గాపాడన్ బ్రియత్నించుతన్. ౧౩౪

ఉ॥ ఏమిటిలంపుఁ బాపములు నీయఘతుల్యము కావు భారత
శ్లోకము లిట్లు చెప్పు నవి సూరివరుల్ శిరసావహింత్రు నా
టిక, *చరిత్రలోఁ గను మటికము గాఁ దలపోయఁబోకు మా
రా! కలికాలమేని యఘ మంత సహింతురె ధర్మచింతనుల్. ౧౩౫

చ॥ గుతఁ డొకచో నహేతుకము గొండొక వేఁడిమి నూనుఁగాక స్త్రో
ప రనము తగ్గఁ జేయుట మహాయము లుండవె? కానిమినముల్

---

*(మహాభారత శాంతి పర్వమునుండి)

శ్లో॥ బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా రాజన్ కృతఘ్నే నాస్తి నిష్కృతిః
కుతః కృతఘ్నస్య యశః కుతః స్థానం కుతః సుఖం
అశ్రద్ధేయః కృతఘ్నోహి కృతఘ్నే నాస్తి నిష్కృతిః॥

(తెలుఁగు భారతము నుండి.)

క॥ అని చెప్పె తాత యిట్లను, మనుమనితో నాదగమున మఱియును బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును, వినుము కృతఘ్నునకు లేదు విమలచరిత్రా.

క॥ అరయ మిత్రద్రోహము, దారుణ మగుపాతకము కృతఘ్నతకంటెన్
వైరము గొని విడువ వలయు, నారెండు తెలుఁగులవారి నాప్తులనైనన్.

§(స్కాందోత్తర ఖండస్థ గురు గీతనుండి.)

శ్లో॥ శివక్రోధా ద్గురుస్త్రాతా, గురుక్రోధా చ్ఛివో నహి
తస్మాత్సర్వ ప్రయత్నేన, గురో రాజ్ఞాం న లంఘయేత్॥

బెఱుకుట, వాని గ్రంథములు వెక్కిరించుట "వేరు" లాటయుక్
జరిగెనె యొన్నఁడేనిఁ? యొకఘాత్రుఁ నుదాహరణంబు చూపెదే. ౧౩౬

ఉ॥ ఊరక యుండు నేని యఘ మూరక యుండదు నీకు బాధకం
బై రహిఁ బీడ వెట్టు నది యన్నదభీష్టము గాద యిప్పడో
కారణ మొంది కాల్లఁ బడఁగాఁ జనుదేరక యుండునాక నీ
దూరచనక్ గుఱించి మది దుఃఖము జెంది సుఖింతువావయుక్. ౧౩౭

చ॥ ఎఱిఁగి యొఱుంగ కేయఘము నేని పొనర్చియుఁ బిమ్మటక్ జనుం
"డరరె? యఘంబు చేసితి నటం చొకకొంత మదిక్ దపించి దు
స్తర మగుపాపమేని యును దాఁటఁగఁ జాలెడిఁ బైకిఁ బాపముక్
బారయుట తెల్పు నేని నరిపోయె నిరాగసుఁ డౌతఁ డంతతో. ౧౩౮

ఉ॥ ఎన్నఁటికేని గాల్లఁ బడుటే నదుపాయ, మఘంబు నాఁడె పోఁ?
సన్నగిలుక్ గురుక్ దెగడుసాహన మూని యొడో లిఖించి నం
తన్నగ్రంథము లాజనులమన్ననఁ గైకొన వెవ్వరో నినుక్
"బన్నమ వాగు వా" గనినఁ బాడకు నోరికి వచ్చినట్లుగక్. ౧౩౯

ఉ॥ చెప్పెడివారు నీ కకట? శ్రేయము గూర్చెడివారు గారు నా
చప్పనిమాఁతలే తుదకు సద్గతిఁ జూపును నీకు; నూర్కరా
విప్పుడు నిన్నుఁ గైకొనుట కేనియు నే నిదుచప్పమాఁతలే
తప్పక కారణంబు నుమి తప్పదుమ్రో వీఁక నేని వీడుమీ. ౧౪౦

## (7) ఆత్మవైభవపర్వము.

ఉ॥ నన్నను గారవించు నరనాథులు లేకొకసాఁకు పన్ని నీ
యున్నపదంబునం దెటులనో వడ నెంచితి నంచు నెంచ కెం
దు న్నను గారవించు నృపతుల్ శత మన్నను లోక మొప్పు నీ
వన్నను విశ్వసింపవలదా? యిలఁ దా నకలం బెఱుంగదా. ౧౪౧

ఉ॥ అప్పనృపాలుఁ డింక సుకయబ్దములోఁ దన పోకడింగి మేల్
చిప్పిల "శాస్త్రిగారి కెటు చేసితి వార్షిక మెల్లకాలముక్
దప్పక యట్టులే యిడుఁడు నాకు ముదం బగు దానఁ జేసి" యం
చొప్పఁగఁ జెప్పె నీ, వెఱుఁగవో సుత! కోకిల పైతి వంతకే ౧౪౨

ఉ॥ ఎఱుఁగుదె యశ్వరాయనృపుని నించుక యాతనిసొమ్ము కాంతితోఁ
దర్శిగడునప్పు డింటి కది తేనువ వచ్చినయప్పుడైన న
న్నరవరి నన్నుఁ జూచెదు ఘనం బగు చూపు స్మరింపు మయ్య! త
త్పరులు *కుమారు లానృపునిధమ్మ్రనఁ జూతురు నన్ను నేఁటికిన్. ౧౪౩

తే॥గీ॥ *ఆత్మకూరును గద్వాల యరయుచుండు, నాదురాకకు నేటేట; నీదురూపు
నీకు నుదయించనేటికి నిన్నుఁ జెఱిపి, బాగు పడ నేల యిుగవలు తిరిగు లుండి.

మ॥ వనిగాఁ దా బెజవాడలో దిగినుమా? ప్రార్థించె మున్నిచ్చ భూ
మిని తేర్కొంగొని తండ్రిగారి యశముల్ మిన్ముట్టఁగాఁ జేయుఁ డం
చును శ్రీయాత్మకురు ప్రజాధిపుతనూజుం; డాతనిం బోలు వా
నిని జూపింపుము నేఁటిరాజులను నెందే శిష్యచూడామణీ. ౧౪౫

---

నూజివీడు.

16-4-11

మీరు ఈడిసెంబరులో నెంతత్వరగా రాగలిగిన అంతత్వరగా వచ్చిన మా అందఱికి చాలా సంతోషము గలుగును...నారయ్యప్పారావు.

---

## *TELEGRAMS.

---

MADRAS.

Starting Bezwada to-morrow morning 8-15 train come Bezwada.

29th July 1911. RAJA OF AMARCHINTA.

---

COCANADA.

19-7-1911.

Atmakur Raja coming Bezvada to-morrow evening meet positively.

---

శ్రీరాజా సూరానేని వెంకట నారాయణరావు బహద్దరు జమీందారు వర గణే మంటలవరం వగయిరాదొరవారు కండం.

ఈనెల 19 తేదీని మంటలవరం గ్రామములో మీ దేశతావధానము చేయిం

ఉ॥ ఇచ్చినభూమి పుచ్చుకొన నేగనిమాపయి నల్కఁ బూనకే
వచ్చి గ్రహింపఁ డం చనునృపాలురఁ గూడను నేఁటి యీకలిన్
గ్రచ్చుట నుండిరే? యశముగాక మఱొక్కటి నిల్వఁ బోదు త
త్సచ్చరితంబు శాశ్వతము దానము మే మిది పట్టుకుండినన్, ౧౪౭

---

చ వలచినాము. గనుక మీరున్నూ బ్ర॥ శ్రీ॥ తిర్పతిశాస్త్రిగారున్నూ మయిలవరం ముకాముకు 18-4-11 తేదీకే రాకోరుతాము. బ్ర॥ తిర్పతి శాస్త్రిగారికిన్ని ఈపత్రికారమే వ్రాయించి యున్నాము. వారికి మీరుకూడా వ్రాసి యిద్దరు కలసి రా వలయును... తప్పక ది 18-4-11 తేదీకే రాకోరుతాను... గనుక తప్పక రావలయును.

మైలవరం 7-4-11 — R. S. V. Narayana, Rao. Bahaddar.

---

శ్రీరాజా వెల్లంకి చినవెంకటరామారావు బహద్దరు జమీందారు ఆఫ్ నడిమితిరుపూరు అండ్ వినగడప వగైరా యస్టేట్సు దొరవారు దండము.
......అప్పుడు శతావధానముకూడా మీవలన చేయించవలెననియున్నది. మేము 1 డిశంబరుకె బందరు చేరుచున్నాము.....వెంటనే జవాబు వ్రాయించవలెను.
చిత్తగించవలయును.

31-11-1912, మదరాసు. — RAJA VELLANKY CHINA VENKATA RAMA RAO BAHADDAR.

Madras, 24-10-12.

(శ్రీరాజా నడిమితిరుపూరు అండ్ వినగడప వగైరాయస్టేట్సు దొరగారి వద్దనుండి.)

.....శతావధానముకూడా చేయించుచున్నాము......6, 7 తేదులకు తమరు బందరు ముకాములో వుండుటకు ప్రార్థించుచున్నాము...... మీజాబుకు యెదురు చూచుచున్నాము. చిత్తగించవలయును.

---

☞ ఇంకను జమీందారుల యాహ్వానములు పెక్కులు కలవు. అవి మఱియొకచోఁ జూడఁదగు, గ్రంథవిస్తరభీతిచే నిట నింతతో సంక్షేపింపఁబడియె

ఉ॥ గుంటూరి పోరు హేతువునఁ గోరిన యానరపాలుఁ జూడఁ బో
కుంటిమి యానృపాలమణి యొండొక నైచ్యముగాక మమ్ము "హు
ష్షంట మెవర్వరో సుదుర్భుమయ్యె నృపనరపాలుఁ డొక్కఁడే యా
దంటయు నిప్పుఁ డీసుడికిఁ దజ్ఞుఁడు రాగుఁడు నే నెఱుంగుదున్. ౧౪౮

ఉ॥ ఆయన యొద్ద నెక్కిరి యత్యములుం డతఁడేని యిట్లుగాఁ
గాయ నెడన్ సహింపఁ డలకోవిదుదర్శన మూయె నాకు బల్
ధీయుతుఁ డంచెఱింగితి విధేయుఁ డతండును 'హుష్షు'తలఁచఁ డో
హో! యొవ రాడకుండిన సు'హుష్షు' జని౦చె భవస్మృథంబునన్. ౧౪౯

క॥ గుంటూరి గుంటల వ్రాఁతలు, గంటిని బలికెడి నటించుఁ గ్రమ్మరనైనా య
వ్వంటికి గుంటూరి గొంటురి, జంటలు జనియించమిన్ భావంగ దద సుతా.

తే॥గీ॥ ఇంకెవరు 'హు, ష్షనిరో పేరి నెత్తి తెల్పు, మల్ల వారి నెమెప్పించి యడఁకుసీదు
తప్పదు ప్రసంగమును వృథా మెప్పెవగుచుఁ, బాదు వ్రాఁతలు గెల్చు దేభయము విడిచి

శా॥ * నన్నాగుల్ మొద లెల్లరాజులు నమన్ సారజ్ఞఁగా నెంచి పే
ర్మి న్నామాటలయందు నించి యనువర్తింతు ర్గురున్ బోలె 'హు'
ష్షన్నా! యొవ్వరినోట వచ్చినదొ నా కామాట వాక్రుచ్చ వా
రి న్నేనే చని యడ్గెదన్ ఘనుఁడొ నూరి శ్రేష్ఠుఁడొ భ్రష్టుఁడో ౧౫౧

ఉ॥ భ్రష్టుఁడు పల్కెనేని యలవానికివందనముల్ ఘటింతు ను
త్కృష్టుఁ డెవండుగాని చని కేల్మోగిపింతు వృథాగ నెందు క
ముష్టిప్రసంగ మారభరి మూర్ఖత యెంతకు వచ్చెఁ దిర్వతి
ప్రస్త నెదుర్వలేక పెలుచన్ గుఱుచల్ లిఖియించువే సుతా, ౧౫౨

శ్రీ ఈశ్వర దేవతా ప్రసాదోస్తు.

క॥ * దేవీ భాగవతాంబుధి, భావామృతము న్మథించి భక్తజనుల నం
భావించు మీదుచరితము, పావనమై దచ్చికడలఁ బ్రఖ్యాతి గనున్.

గీ॥ చక్కెర పెక్కెడి చలిచీమ వడువునఁ, దీపినీటి కెరుఁగు చేఁపవగిది
భాగవతామృత పానసంసక్తమైఁ, దనివి చనవదేమి దాహమహిమొ.

(పరమ శివేంద్ర సరస్వతి)

జ్ఞానానందుఁడు

మ॥ ఘనతేజుండు దివాకరుం డనఁ *గృతఘ్నఘ్నుండు తద్దేవు పే
రున నెవ్వానికులం బిలన్ వెలసె సారూప్యస్థితిన్ వానితోఁ
బెనఁగన్ జాలు కృతఘ్నులుం డునెడ రేపే వచ్చి సాక్షాద్విరో
చను నూడించుఁ దమస్సమూహ జలదస్వర్భాను కేతుప్రభల్. ౧౫౩

మ॥ ఎవరీ 'హు, ష్షను వాఁడని నీ వెఱుఁగుచో నేర్పాటుగాఁ జెప్ప వా
రవనీపాలురొ? మంత్రిసత్తములొ? లోకాలోకపర్యంత భూ
భువనవ్యాప్యవృత దివ్యకీర్తికలనా స్ఫూర్తిన్ విడంబించువా
రెవరేనిన్ జని వారి మెచ్చుకొని నీ యీవాక్కు బంధించెదన్ ౧౫౪

మ॥ ఎవ రా ''వాసియు వన్నెయున్ గలుగువారెందుండువా రెట్టివై
భవ మొప్పారెడువార, లేమతమునన్ బద్ధాదరుల్? నెవ్వ నీ
కవనమ్మున్ గురుభక్తియున్ మిగుల శ్లాఘాపాత్రము న్చెంచి న
న్నవమానింపఁగ "హుష్షు హు"ష్ష నిరొకోరి యంతేవసద్దూర్వహా. ౧౫౫

శా॥ భావత్కప్రతిభం గనుంగొని భవద్వాణిన్ విలోకించి నీ
భావంబున్ సరిగా గ్రహించినయెడన్ బల్కం డొరున్ "హుష్షు" నీ
సేవల్ సూచినవాని కింకొకనికైఁ జీకాకునుం బుట్టునే?
దేవానాంప్రియతాఖనీ? గురుని నిందింతే యసత్యోక్తులన్ ౧౫౬

మ॥ ఒకసందర్భముఁ జూచినన్ సకలమున్ రాజింపఁగా వచ్చు నీ
యకలంకత్వము వేఱె చెప్పవలెనే యాయీ దురుద్యోగమే
ప్రకటించున్, బునరుక్తి కాస్పదుఁడనై వర్ణించుచోఁ ,,జెప్పాకం
ఠో కఁడో? సిద్ధి,,యటన్న సామెత సుమీ యూహించుకొ 'మ్మాత్మలో. ౧౫౭

చ॥ గురుఁ డెటువంటివాఁడు గుణకోటియెడన్, జరితంబువట్ల,శాం
కరి? నను నెట్టివానిగను గన్గొన నేర్చితి, తచ్చరిత్రమున్
బరిపరి నాచరిత్రమును బట్టి వచింపు మటన్న స్వప్నమం
దరయఁగఁ జేయనంబిక యథార్థ మటుల్ భజియింపు మీశ్వరిన్. ౧౫౮

---

* (శ్రీమద్రామాయణములోని ఆదిత్య హృదయమునుండి-)
శ్లో॥ కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః

ఉ॥ ఆపె వచించు సర్వమును నాయము కెందును లేదు గోప్య మే
పాపము నెట్టి పుణ్యమును బాలన చేసెడి తల్లి "హుష్షు,, దా
నీవయి యుంచునో? నిను గణింపక నావయి యుంచునో? వృథా
లాపము లూడ్చి కన్గొనుము లక్ష్యము తప్పక గొల్వు మంబికన్,,. ౧౫౯

క॥ గురుశిష్య ధర్మముల శం, కరుకతనన్ వినియె నాపె సాక్రాంతమునం ది
త్రైలఁగు కనం బడు నీకున్, దరణోపాయంబు చూపఁ దగు నాపె సుతా.

క॥ ఔరా! నను హుష్షని నీ, సారాచారములు మెచ్చు జనులుం గలరో
క్రూ? రమ్ము రమ్ము పోవుద, మేరాజన్యుకడ కేని యిది తేటపడున్. ౧౬౧

ఉ॥ మూల ముడింగి సారెకును ముష్టిప్రసంగము నీవు బావయున్
జాల లిఖింప వచ్చు నెకసక్కెము లాడఁగ వచ్చుఁ గాక టూ
ట్టూ లెటు సాగు వేరొకయెడన్; బొనరించిన లోపముల్ వృథా
ప్రేలుటలున్ శిరమ్ము నత ప్రేఁగు ఘటింపక యూడఁ బోవునే. ౧౬౨

ఉ॥ ఎన్నిటినేనిఁ గవ్వు జగదీడ్యతరం బగుశక్తి, యట్టిదే
యున్నయెడన్ గురుం డెగడి యున్నదిఁ గోరఁగ నేల? కీర్తికిన్
దిన్ననిత్రోవయే కలదు దేవుఁడు దాని నొసంగకుండుయే
యిన్నిదొసంగు లిక్కరణి నీవొనరించునిమిత్త మర్భకా. ౧౬౩

శా॥ పాపంబుల్ తలురీతు లందెదిమె యెప్పాటన్ మనుష్యుండు తా
మాపో రేపొ యొనర్పకుండుట యనంభావ్యంబు, నేఁడన్నిపా
లాపానాతుల వైనముల్ ఘనులె హేలన్ జేయుచున్నారు నీ
వాపాదించుకృతఘ్నతా భర మొకిత్యాశ్యంబొఁ జూమీ యెరికిన్. ౧౬౪

ఉ॥ దీనిమహాత్త్వమున్ దెలిపి తిన్నని తోవను బెట్టుమన్న చో
హీనుని గాఁగ నన్ విబుధు లెంతురు నీకును లేదు ముక్తి; దెం
దానఁ బునః పునర్మనన నాగురుతన్ గుటిచేసి చేసి వ్యా
ఖ్యాన మొనర్చి తిన్నఁ బడి కైకొనుమయ్య కుమార! భద్రముల్ ౧౬౫

క॥ వినుఁడ జెలుప నెంచినన్ న, న్నీను *"నేదో' 'కవి, యటంచునన్ దిట్టినజా
బును కోనియెద్ది కంపినఁ, బనుపడదే, నాదు కోర్కె బ్రహ్మాండంబే ౧౬౬

---

తల్లెపాలెము.

*"శ్రీగంగాభాగీరథీసమానులగు... బాళ్ళగారికి. నీవు వెంకటరామకృ

ఉ॥ "ఎప్పటికేని నీవచట నే సుఖముందువుగాక, నాదు పే
ర్చెప్పక యుండినన్ నృపతిచే వినిపించెదఁగాక నీదు వా
తప్పుడు పేరు లీశతవధానమునుండి మరల్తుఁగాక" యం
చిప్పనిఁ బూనితిన్ జరిగె నిన్నియు నొక్కటి తప్పకుండఁగన్,, ౧౬౭

---

ష్ణకవులకును తిర్పతి వెం+కవులకును తంత్రము పెట్టినట్టు విన్నాను నీకు అందువల్ల వెం+కయైనను లాభము లేదు, ... నా పేరు వ్రాయక పోవుట మరచి వ్రాయలేదు. (బూతుమాటతో చేవ్రాలు.)

☞ షరా, ఇందు చేవ్రాలు మాలమాదిగలుకూడ నుచ్చరింపని బూతుమాటతో వ్రాయుటట్లుండనిది యెవరినుద్దేశించి వ్రాయఁబడినదో వారిని దిట్టిన తిట్లుకుఁ బరిమితి లేదు మఱియు నీయుత్తరము కాని కార్డుపై వ్రాయఁబడినది మొదట పెన్సిలుతో వ్రాసి పిదప వేఱొక సిరాతో దిద్దఁబడియున్నది — ఇఁక నొకమాదిరి సిరాతోఁగూడ నొక్క కాముడియుఁ గొమ్మును సవరింపఁబడి మొత్తము మూడు వ్రాఁత లుపయోగింపఁ బడినవి కార్డుపైని అడ్రెస్సు మ॥ రా॥ రా॥ అనియున్నది లోపల వేఱువిధముగానున్నది బూతు పేరితోఁ జేసిన వ్రాలు కార్డుపైనిగూడ పెన్సిలుతో వ్రాసినది కలదు మఱియు నిట్టిదే వేఱొక యుత్తరముకూడ నిట్టిచేవ్రాలుతో నీయన నుద్దేశించియే వ్రాసినది కలదు. విషయభేదము లేదుగాని యందలి యంశములు మఱియుం బచ్చిగానున్నవి. ఇందు రెండుబొమ్మలు వ్రాయఁబడియున్నవి. ఎన్నో బూతులనేకవిధముల నసందర్భముగా లిఖింపఁబడి యున్నవి. అవియేవియు నింకు దాహరించుటకు రాజశాసన మొప్పదు కాని యగుదుఁ దుట్టుదను వ్రాసిన తప్పుడు సీసపద్యము మాత్ర ముదాహరణయోగ్యముగా నున్నది.

"సీ॥ పురుషుండవో కలి పురుషుండవో కాని ధూమకేతువుతోడ తుల్యమగుచు
భయమొకింతను లేక నిర్భయంబుగ నీవు గ్రామమృగ రాజుతో తుల్యమగుచు, నీవలు
కును దాని పలుకొక్కటియె కాని మాయదెప్ప డొక్కటి సారిగాని, తే॥ గీ॥ యిట్టినీ
దుష్టచరితంబు యింపుమీర, వ్రాసినాడను నేను వహ్వాయనగ.
చింతగింజవలెను.

యు. మిష్టరు. (అవాచ్యపుచేవ్రాలు)

యీపత్రికలు యితరులకుకూడా పంపినాను."

ఉ॥ ఇప్పటికేని నీయెడలనే దయ నా కధికంబు, నీదువా
తప్పఁ బ్రసంగ మంతగ నెదన్ జెదరింపదు నీవు పెట్టువా

---

☞ పైయుత్తరములు వ్రాయువారు వ్రాయించువారు వీనియందుద్దేశింపఁబడిన వారును జాలదగ్గఱబంధువులు, మాశిష్యులోనర్చెడి యసందర్భ ప్రసంగమును విని మండలించినందులకై వారివంకనుండి యిట్టియుత్తరములు వెలువడఁజొచ్చినవి. వీనికిసంబంధించిన రికార్డు సర్వమునుమావద్దనున్నది. ఇటీవల నీయవాచ్యపుటుత్తరములంగూర్చి బంధుమిత్రులు కొందఱుచేరి మందలింపఁగా జరిగినయంశము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

..."ఈమధ్య వెంకట్రామయ్య యిచ్చోటికివచ్చినాడు అప్పుడు యీయుత్తరము మాకువచ్చినట్లు ప్రసంగవశమున వచ్చినది,......వెంకట్రామయ్య తమ్ముడు సత్యనారాయణ ఎరుగక వ్రాసినట్లు దక్షిణామూర్తి మొదలగువారియొద్దను అన్నాడట, ......దగ్గరబంధుత్వకారణమున నేమియుదలచక మాటలాడ కూరకున్నారము, పాపపుణ్యములు భగవంతునకే యెరుక. ......మామీదలేనిపోని మాటలాపాదించి ఎవరువ్రాస్తే వారేయనుభవింతురని ......యూరకున్నారము...వెంకట్రామయ్య తమ్ముడు మాత్రము "మాఅన్నయ్య వ్రాయుమంటే నేనువ్రాసినా"నని అక్కడక్కడ అంటున్నాడు. (చేవ్రాలు)

☞ దీనితరువాయినిగూడఁ గొన్నిపంక్తు లీక్రిందవి వ్రాయఁబడినవి.

"వెంకట్రామయ్యతమ్ముడు సత్యము అక్కడక్కడమాఅన్నయ్య వ్రాయమన్నాడు గనుక . . . రావునకుత్తరములు వ్రాసినానని చెప్పడముచేత వెంకట్రామయ్యయే వ్రాసినాడేమోయని నేతలచి మొదట మీవిరోధములు నామీదకు కూడా వచ్చినవి యని మీపేరవ్రాసినాడను."

☞ శ్లో॥ కర్తాకారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః। అనునార్యోక్తిం బట్టి పైయుత్తరములలోని సంగతి సందర్భములను బట్టియుఁ బ్రాజ్ఞులు విచారించి మాశిష్యుఁడుగారి గురుభక్తిని నిర్ణయింతురుగాక ఇతఁడు చెప్పి వ్రాయించినచో నడుగనేయక్కఱలేదు తనంతటఁదానే యీతనితమ్ముఁడు వ్రాసినచోఁ దమ్ముని బట్టియన్నగారివివేకమనుమేయము కాక మానదు ఆయీపోకలయందలి యోగ్యతను గూర్చి భగవంతుఁడును దత్తుల్యులగుయోగ్యులును విమర్శింపఁదగువారు

తప్పదుఁ బేరు లాశతవధానము పేరును మాపుచుంట నా
ముప్ప నడంచుపొంటె నిది పూనితి నిక్క్రమము నమ్ము మర్భకా. ౧౬౮

ఉ॥ పూనినపూనికన్ దెలిసి "పొట్టకుఁ బూనితి నైఁపుఁ డంచు నా
పై నెనరుంచుఁ డంచు నొకపాటిది యుత్తర మంపికోక దు
ర్మానపుఁ బ్రోవఁ బ్రౌఢ్కి యపరాధము పెంపొనరించి కొంటి వి
ప్రేనియు మంచిత్రోవఁ బడు మిం కపరాధివి కాకు వాకులన్ ౧౬౯

ఉ॥ ఛాత్రత దాఁచి వేఱొకయనహ్యపు మార్గముఁబట్టి పూర్తిగా
శత్రుత వెళ్లఁబెట్టియుఁ బ్రసక్తికిఁ గాని ప్రసక్తిగా గురు
స్తోత్రము లన్యథా నలువఁ జూచెద వింతటిలోనె నాయశ
స్సత్ర మపాత్ర మానెని పలుసజ్జను లుండఁ గవీంద్రు లుండఁగన్. ౧౭౦

మ॥ అవధానంబొనరింప లేఁ డతఁడు నాయాచార్యుఁడుం గాఁ డటం
చవనిన్ మెచ్చఁగఁ జేయలేవు విను మబ్బా! "తప్ప సైరింపుఁడీ
యవివేకంబొనరించినాఁడ" నన నార్యస్తోమముల్ మెచ్చు "ము
ల్లు వెలార్పంగను గొట్టు గొట్టికొనుటల్" లోకుల్ ప్రశంసింతురే ౧౭౧

క॥ "దాసునితప్పులు దండము,తో సరి-, నామాట వినుము తుచ్ఛపువ్రాఁతల్
వ్రాసికలహమ్ముఁ బెంచకు, మోసుత! బుధు *లాడుమాటలూఁకొనవకటా.

---

*బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారి సన్నిధికి. (నవరత్నమాల.)

చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీతిలకుల్ విలసచ్ఛతావధా, నరతిదలిర్చ నై
కనరనాథసభాస్థలులన్ జయంబుగాం,చిరి వరకీర్తి దిక్తటులఁ జెంది సముజ్జ్వలచం
ద్రికావరి, స్ఫురణముఁ జూపఁ బండితులుభూరిముదంబున సన్నుతింపఁగన్. ఉ॥ ఆర
య సర్వశాస్త్రములయందు సుదంచితమైన సాహితీ, ధోరణి మేలుమేలని బుధుల్గ
నియాడఁ గవిత్వవిద్య కా, ధారము వీరలేయనఁగఁ దద్దయుమించుపొగడ్తగాంచి
యా, ధీరు లుదారభావమున దీపితులై విలసిల్లుచుండ్రఁగన్. ఉ॥ వేంకటరామకృ
ష్ణు లనుపిన్నకవీంద్రులు నేఁడువారికిన్, వంకలఁబెట్టి వారలప్రబంధములందువిమ
ర్శనంబునాఁ, గొంకక వ్యర్థలోపములుగూర్చుట తాతకు దగ్గునేర్పమై,యింకిటఁ
బండితోత్తముల కెల్లను గర్హ్యము గాఁగఁదోఁచెడున్,ఉ॥ పిన్నలు వారు పైకొను కవి
త్వమదంబున బద్ధులేమివా, కొన్నను రాజబాట గొని కుంజరమేగ మృగంబులెన్ని

ఉ॥ శాకవు లెల్లఁ గాకవికిఁ గాలికి మువ్వను గట్టి గంటిమే?
యేకముగా జగమ్ము లివి యొల్లను ద్రిమ్మెడి నీదుబావ "మా
కా(ర్)కలుదీరినట్టి కవిగండని గాఁ దెలు సెప్పె నూట నీ
శాకవిఁ గూర్చి, తాను మొక శాకవిగానొ? కవినా? వికంబులో. ౧౭౫

చ॥ "భయ పడ కేను రా", నను చుఁ బల్కరి జ్ఞప్తి యొకింత లేదె! యా
శయమునఁ జూచితో యొకట స్వాంతము మండి పిఠాపురంబు నా

---

"... తే॥ గీ॥ అట్టిమిత్రుడ్డ విద్యల నభ్యసించి; కయిత బల్లంగ నేర్పను గాం
చితి దను, మీరుగురువులు కారని మిమ్ముఁ దెగడు, ననుఁ గుశిష్యులు గల్గని యనఁ
గవింటి. చ॥ గురుఁ డనఁ గేశవుండె జనకుండును దైవము నా ప్రమిత్రుఁడున్, గురుఁ
డె గురుండె శిష్యుఁ గడుఁ గూరిమి నారని ప్రోచు దాతయున్. గురుఁ డెక్కపాంతరం
గుఁ డయి కోరిన విద్యల నిచ్చినట్టి యా గురుని దిరస్కరించి యనుకూలత నెట్లు గడిం
పనచ్చునో...... తే॥ గీ॥ అకట గురువుల కహితంబు నాచరించి, చెడిన వారలఁ జ
దువరో శిష్యులరని, చదివి మంచిరో లేక యీనరణి లెన్న, యంచుఁ బలఁచిరో? కలి
కాలమగుటఁ జేసి. క॥ వారల దెసఁ గోపింపక, తారూరక యుండ వేఁడెదను గాకు
న్నన్, దారించుక కోపించిన, వారికి నేమంబు గాదు పండితులారా! ఉ॥ ధర్మన
ముఖ్య లోకతవధానకతాంగముకొ దారి సూపఁగా, నిర్మలమైన మార్గమున నిన్నల
తిర్పతి వేంకటేశ్వరుల్, మూర్తిని దేశదేశములఁ గుప్తమ్ము రఁ జేసిరిఁ నేడు నీదుడు, వృ(కా)
ర్తము దేమి యాష్పచును గాకవులిద్దఁగ దార్లదక్రటా. క॥ నీకుఁ గలయశము
నెడదిడె, శాకవులం బాఱఁ దోలి ఘనతిర్పతి సు, శ్లోకుఁడును వేంకటేశుఁడు, సాఁకు
చునున్నారు నిన్ను జయము మను నీకున్. సూర్యభట్ల వైద్యనాథం.

---

...... ...................... ..................................శ్లో॥ యేగీరతం ప్రతి
దినం పఠంతి విబుధాస్త్రుతాః, తే గురుద్రోహపాపాత్రృ, విముచ్యంతే న సంశయః

ఇట్లు, రామనాగేశ్వర భక్తిరసప్రధాన కీర్తన శతకత్రయ నిర్వచనాంధ్ర
రఘువంశ కావ్యకర్తయగు:—భమిడిపాటి అయ్యప్పశాస్త్రి, హెడ్ మాస్టర్,
మండపల్లి, లింగాలపోస్టు, కృష్ణాజిల్లా. 11-12-18

దయకు నివాసమైనయెడఁ దత్తుఱ మందవాని పాఱిపోవాని ని
శ్చయముగఁ దెల్పుమీ ప్రతిన జార్చద వెంటనె వచ్చి తీరెదన్ ౧౭౬

---

Injeram.

6-8-10

“...ఉ॥ పూతచరిత్రులైన తమబోఁటిమహాకవులందు వ్యర్థపుం,జాతురి మీఱ వాగ్వ్యయము, సల్పనబోఁ దమరెంతయో మహా, ఖ్యాతిని గాంతురంచు మదిఁ గర్వముచే నిలఁగొందఱుందురా,నీతివిదూరులన్ గనిన నేరమటుంచుఁ దలంచకుం డరే. చ॥ కవులని పేరుపెట్టికొని కాలము పుచ్చుచు నొక్కరుఁడో మహా,కవులను ధిక్కరించుటయె కార్యమటంచుఁ దలంచువాఁడు కా,కవియగుఁగాని సత్కవికిఁ గాకవి నామ మదెట్లు చెల్లు న, త్కవులకు దీనలోపమది గల్గ దొకించుక యెంచి చూచినన్. గీ॥ గురువులనె వెక్కిరించెడుకు మతులింక, తల్లిదండ్రుల నేరీతిఁ దనుపఁగలరొ, యహహ! వారల నేమనియనఁగవచ్చుఁ, గాలమాహాత్మ్యమనియె యుంగ వలెఁగాక.

వెలువలి వీరశంకరమూర్తి,
సా॥ చింతామణి.

---

మ॥ గురువే బ్రహ్మ, గురుండె విష్ణువను, వాక్యాన్ దూలఁగాఁ బుచ్చియే తెరువో మాకమరెన్ గదా యనుచు నెంతే యుబ్బి తబ్బిబ్బుగా, సరసుల్ మెచ్చఁగ నెట్టులోఁ బరమదే చాయన్ బొసంగున్ బరా, త్పరుఁడెట్లారకయుండుఁ, దప్పని ననేతాదృక్షమే లేదు, మీ, రరయుఁడీ యిదె బోధసేతునని సత్యం బెల్లఁ జాటించు మీ, గురుశిష్యక్రియబోధి గీరతము నాకున్ బంపుఁడీ యొండు... ...దేవానిసగంబా వెలన్, గరుణన్ గీరత మంపుఁడీ యనుచు వేడ్కన్ నిచ్చలున్ మ్రొక్కెదన్, సరసానందకృతి స్వభావకృతి కృత్సర్వజ్ఞ, రావేంకటేశ్వర సత్కవ్యధిరాజ! కింకవిఘటాపంచానసా, శ్రీపతీ॥

ది 4-3-1911

శిష్లా వెంకటసుబ్బశాస్త్రి
పొన్నూరు పోస్టు, గరికపాడు.

ఉ॥ చక్రముఁ బట్టనే ననుచుఁ జక్రి ప్రతిజ్ఞయొనర్చియుక్ దురా
పక్రమ మేగు దేర నది పార్థునపేక్ష యటంచు నెంచి యీ
యక్రమ మెట్టునేను నన్యతాత్ముఁడ నయ్యెద నంచుఁ గొంక కే
చక్రము దాల్చె శౌరి, యది సాహస మిచ్చెడుఁ గాక నాకిటన్.

---

క॥శ్రీతిరుపతి వేంకటకవి, నేతలకు జగత్ప్రసిద్ధనిరుపమనిత్య, ఖ్యాతిప్రశిష్యుతులకుఁ గరు, ణాతత్పరులకు విపక్షనాగహరులకున్ గీ॥తగిన దగకున్న శిష్యులు తమకుఁదగిన, కీర్తి నే గూర్తురే గాటిధూర్తులు నవ, యశము గూర్పరు పూర్తురే నదియు రాదు, గురువులకుఁగాన శిష్యుఁగాఁ గొనరెనన్ను గీ॥ అన్మదీయభోగేశ"మాహాత్మ్యవిషయము, గురుమణీమాలలో మిమ్ముఁ గూర్పకొనెడి, వైభవము పట్టుకున్నను వ్యాకరణము, గఱపి యుండేని నద్దాని గరణి నిడరె.గీ॥ మీకు శిష్యుల మను పేరె మాకుఁ జాలు, ననుచు నతఁడు విపంఘుంబు లనుసరింప, వఱలుచుండెడి కవిచక్రవర్తులకును, వాయసవ్యాసబలవద్వివాద మెుండె గీ॥ యేనకేనాప్య పాయశాస్త్రానుసార,ముగ జలదసార్థగర్జితములకు సూచ, కంబులై ఖ్యాతిగనుటె, ఫలంబు కప్పకూఁతలకు నెందునందుకే కూయు నవియు. గీ॥ బెకబెకల కేమి తఱుగవు భేకములకు, నిట్టియాసారములవల్ల నెట్టిసరసు,లకునుగట్టులుమీఱుటల్ గలుగు నింక, జ్ఞాన సూర్యుని గనఁజేతురేని మేలు గీ॥ వాయసవ్యాసముఖమున వారె కృష్ణ, పక్షితకు నొప్పికొనినట్లు స్పష్టమగుటఁ, గోకిలలకు రామాభిఖ్య మూడదనుట, వారె కాకములుగను గావలసియుంద్రు. సీ॥ కాకంబు పేరిడి గ్రంథంబుముందుగాఁ గప్టించి చేసినకారణమున,'పాపిచిరాయు'వన్నా కాన్యంగతిఁజిరజీవితకు గురుదూషించుకతన,పులిఁజూచి నక్క''యనుచ్ఛాలిక నే తద్వాచ్యబాధక నామము ల్వదలికొనుట, బలివేయుమిభుఁడీడి బయలెక్క ననుతలల్ దక్కవుమనకని తారియుంటఁ గీ॥గాకవీట్పదపట్టాభిషేకమునకుఁ, దగినవారలు వారలే తగరు మీరు వరభృతత్వంబు "నందర్శకవ్యములను, జెప్పికొనుటకు ఫల మిదిసిద్ధమయ్యె. గీ॥ అక్కఱము తక్కువగుట వ్యాసమైత్రి, కావలసివచ్చె నెవ్వడు గాకములకు, నుభయపేశనమున నది యుదయమందె, నుభయ కర్తృకతను జెప్పచుండుఁబేర. గీ॥ అకట? కాకముల్ తాము వాయసము లగుట, నరయకయె కాని యరసిన నంతకంటెఁ, దమకె యొకయక్కరం బెచ్చుతనరుచుంట, వ్యాసమైత్రికి నొప్పవు లీనమని.గీ॥ ఒకక్కస్వరమధికంపైన లెక్కయేమి, బాగుగాఁ బొత్తు కుదిరెను వ్యాసమైత్రి, వాయసశ్లేమకర

యవనీశుం డయుడే నిమేషములు నా కర్పించుచుఁగా కాదనం
బెవియుఁ జూడక వీడకే నిలుచునట్లేఁ జేసి మెప్పించెదన్.

చ॥ అయుడని మేషమాత్ "టులుసు", సర్పణఁ జేసియు నైదు యామముల్
పయి నెల లైదు పిమ్మటను వత్సరముల్ మఱిరెండు నిచ్చి "మీ
దయ", యనిపించుకోఁదగిన దార్ఢ్యము సద్గురువర్యు లిచ్చి రీ
మాయ నది యూపుఁ గాకము ప్రమేయము గల్గిన నూపికన్ బిగా.

చ॥ వెనుకటిపోల్కెఁ గాక మిడి వృద్ధగుటం బని సేయలేదటం
చనుకొనినాఁడ వో తనయ? యజ్ఞుఁడవై కద? కాక మంటి దా
నిని జిరజీవిగాఁ దెలుపు నిర్ణయముల్ విన వో? కొల్కి యొప్ప డో
కర్కటి యతినే కనంబడెడిఁ గాకము లోకములంగదే సుతా.

---

(స్వధర్మప్రకాశిని పత్రిక చతుర్థసంపుటము 7, 8 సంఖ్యలనుండి.)

# సతీర్థ్యసంప్రార్థనము.

(వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినది.)

శా॥ అమ్మా! భారతి! కేలు మోడ్చుకొని నిన్ యాచింతు నొక్కింత నీ, సమ్మానమ్మునఁ జేసి యాభరతవర్షమ్మందు విద్యాతరుల్, రెమ్మల్ కొమ్మలు గల్గి పల్లవుల వర్ధిల్లన్ వలెన్ సర్వశాం, తమ్మై పోవలె నెందుఁ బండితవివాదస్ఫారదావోద్ధతుల్॥ మ॥ ఉడుగుం డయ్యసతీర్థ్యులార! యుడుగుం డొప్పాను తప్పాను మీ, యడుగుల్ మ్రొక్కి విధేయభావమున నభ్యర్థించుచున్నాఁడ; మీ, నుడుగుల్ పత్రికలోఁ బఠించి రవి వీనుల్ సూడినట్లయ్యె నే, చెడుగుల్ కోకిలకాకముం గనిన మీచెద్దమ్ములన్ మెత్తురే॥ ఉ॥ శ్రీకరచెళ్లపిళ్లకులసింధుశశాంకుని వేంకటేశ్వరాభ్యుని సద్గురుపత్రవరుఁ గాకినిగా మఱి నిష్కళంకను, ద్ధీరుని దత్పముఖ్ దిరుపతిన్ గురుచందితుఁ గొంగగాఁ దలుం, గోకిలఁగా వచించుకొండొక కైతను వెల్లడింతురే. శా॥ అచ్ఛానేకమహర్షి నిర్మితమహాగ్రాచారనిర్మాణముల్, స్వేచ్ఛాచారులు నేఁటికాలమునయుం దెందెంత్ విజ్ఞవే, పచ్చన్నుల్ పడఁగూల్ప నందు గురుశిష్యన్యాయనిర్మాణ మూ, లోచ్ఛేదమ్మున కీరుపాల్పడితి రొక్కో! రామకృష్ణాఖ్యయుల్. ఉ॥ చిల్లులగవ్వయే నఖిలపింతక విద్ది

ఉ॥ "శాకము వచ్చె" నంచు నృపకాంతునితో వచియించు వాఁడవో!
లేక "బక" మ్మటందువో? మలీమసుఁ డందువో? లేఁడు దర్శనం
బీక యనాదరించు నటులే ఘటియింతువొ? తత్సభాస్థలిన్
మూకత సంఘటించెదవొ? ద్రొక్కెదవో? మఱి యేమి చేసెదో.

---

యనేర్చి మూర్తి నం, ధిల్లఁగఁ గాంచు సద్గురు విధేయతన్ గనుచుం బదిం బదిం బల్లనివేళ సంస్మరణ నల్పుచు నుండుటలేక యుచ్చమైఁ, గల్లలు పల్కు యేమి యధికమ్ము గణింపఁ దలంపుఁ గొంటిరో. చ॥ శ్రీమపది విద్యలం గఱపి సాఁకి ప్రయోజకుఁ జేసి వృద్ధికిం, బ్రిమదముఁ జెందు సద్గురు సభాస్థలిఁ బేర్కొను టాత్మగౌరవ, క్రమపరిహార కారణముగాఁ దలపోసెడువారి నేరిఁ గా,నము విన మెప్పడిప్పుడు కనన్ విన నయ్యెఁ గదయ్య యయ్యెడన్. మ॥ గురువుల్ తిర్పతివేంకటేశ్వరులు మీకున్ మాకు నిక్కంబు; త, త్కరుణాసారమె కారణమ్మరయ విద్యాబీజ మొక్కింత యుం, గుర మందున్ మన కెల్ల నిక్కముగ; మాకున్ వారికిన్ శిష్యతా, గురుతల్ లేవను మీనుడుల్ వినిన నేక్రూరుండునుం గుందెడున్. ఉ॥ "చెప్పుటలేద" యంచును వచించితి రొక్కెడఁ జెప్పనేనియుం, జప్పనికూఁతలే" యనుచు సాహసమొల్లను వెల్లడించినా, రొప్పులకుప్పలార! జగ ముందు లెఖింగి యిటుల్ లిఖింపఁగాఁ, జెప్పఁగ మీకు నెప్పగిదిఁ జేయి రయా వాయియు నాడెనో గదే. ఉ॥ అన్నా! మీరును బండితప్రవరులే యన్పించుకోఁ గల్గి పై, నెన్నండే నొకశిష్యుఁడుం గలిగి వాఁడింతేని యంతేని వి, ద్యన్నిక్కమ్ముగ మీకడం జదువనై యల్పజ్ఞుఁడే యయ్యె మీ, కన్నన్ మిన్న నటంచు మిన్నుఁ గన నెట్లో మీకుఁ జింతింపుఁడీ. ఉ॥ వేంకటశాస్త్రి పండితకవి ప్రభుపాదము లాశ్రయించి ని, శ్శంకముగా గడించితిమి శక్త్యనుసారము సంస్కృతాంధ్ర మూ, లంకష సాహితిం గవనలాఘవముం దగు శబ్దశాస్త్రముం, జంకమ యేము మూచదువు సర్వముఁ దత్కరుణాత్తమే చుఁడీ ఉ॥ పాల్పుగ నభ్యసించితిమి ముప్పర మేకముగా నసల్పమో, స్వల్పమొ శబ్దశాస్త్రమున యందు నవారిమలీనుఁ డేనునుం, దెల్పఁగ నేమిలాభము! గతించెను వేంకటరామశాస్త్రియున్, వేల్పయెఁ గున్ గురూత్తముఁడు వేంకటశాస్త్రి మహార్థబోధముల్. ఉ॥ అంకిలిలేని చెల్మి కిరవైనయతం డతిశాంతమూర్తి ని, ష్పంకహృదంతరుండు పినిపాటికులోద్భవుఁ డాత్మవేది శ్రీ, వేంకటశాస్త్రిసద్గురుని ప్రేమకు కెంతయుఁ బాత్రమింకమూ, వేంకటరామశాస్త్రి కెన వే

ఉ॥ చూడఁగ నిచ్చ యున్నయెడఁ జూపెద నాదగువార్ధకంబు, నిన్
జూడ మనంబునం గలదు సూ సుత! పుట్టెఁడుకోర్కె; బావ కీ
జాడ నెఱుంగఁ జెప్పి యొక జాబును బంపుము "సైరు" తీరు. వె
న్నాడెద శక్తిఁ జూపెద నహా! యని మీనృపుఁ డక్కజం బడన్.

క॥ నీవున్ బావయు నృపుఁడును, జేవ యనఁగ నిట్టి దనుచుఁ జెప్పికొనంగా
నా వెట్టిపాట పాడెద, దేవుఁడు గలఁ డంచుఁ దెలిసి తిరుగుము తండ్రీ!,

శా॥ "వీడన్ జాలక వెంట వెంటఁ బడు నీ వేయిండ్లపూజారి యు
వాడన్ జూచిన నున్ బరించు" టది భూపాలుండె పాలించుఁగా
కేఁడీ యాతఁ డటంచు నేత్రములు కెంపెక్కంగ నిన్ జూచుఁ గా
కూడన్ గొట్టెడుఁ గాక నిర్భయ దురుక్త్యుద్రేక సౌభాగ్యముల్,

---

లి,త్తతిసె యెఱుఁగుఁ, డెంతకవితా కమనీయత కగ్గెనేనియుం, గురులకెవంగనా మములు మార్పఁదలంచుట పోలునే? నిజం,బరయుద మైనఁ గాని కలనా యలతిర్పతి వేంకటేశులం, దారనెడిపాటివేత్తృతయుఁ, దుండుడుకందితిరీరు; నిక్క పెక్కురణిని బోల్పవచ్చు శతఘంట మహాకవితావిలాసినీ, సురుచిరభోగభాగ్యములఁ జూరలఁ గొన్నరసజ్ఞవర్యులౌ, తిరుపతి వేంకటేశ్వర సుధీవరులన్, మొనమొన్న వారి డ, గ్గఱనె పరిశ్రమంజరిపి కైకొనినట్టి యొకింత పాండితిన్, విరిసెడు కైతమున్ గలిగి వీధికి నెక్కు చునున్నమిమ్ములన్, దిరుపతి వేంకటేశ్వరులటం గువారని పేరుకొందురే, తఱచుగ మీరు నన్ శతవధాన మొనర్తు మటంచుఁ జెప్ప కొం, దురెకద! యెయ్యదీ! కటుమతుల్ మనతిర్పతి వేంకటేశ్వరుల్, జరపిన వాసికిన్ సవతు సల్పఁగ నొప్పగునట్టి దెప్పడె, కృగణిని జల్పిరెక్కడ? ప్రకాశము నేయుఁడు దానివైఖరుల్, చిఱుతలు పోవఁబోవఁగఁ బ్రసిద్ధికెక్కఁగ నగ్గలక్కటా, గరువపుఁ జెద్దుముల్ కలుగుఁ గా కవి యొండొకచోటఁ జూపకా గురువులపట్లఁ జూపఁ దొరఁకొంటిరె లేక జగమ్ము మెచ్చు మీ, తరువున కల్లహారు గురుపట్టముసందన సమర్థులైరె భా, స్వగశరదిందు చంద్రికల చాదృపన నెల్లెడవెల్లిగాంచిదు, స్తరమగునట్టి వారల యశంబును దాఁటఁగ మాటుపుచ్చమీ, తరమగునే తలంచుఁడు వృథాకృషి నీకుఁడయ్య; అయ్యో బో, జరిగిన దానికేమి సువిశాలమనస్కతఁ జితచేసి యు, ష్పరుసున [illegible] డఁడఁగ నివాదములన్ మతివ

క॥ వృద్ధుఁడ నని, ప్రకటించితిఁ బుద్ధుం డగుశిష్యుముందు "కోఁతికిసరి" గజ.
శుద్ధుండు కర్ణుఁ డేమగుఁ? శ్రద్ధమెయిన్ భారతమ్ముఁ జదువు కుమారా!.

తే॥గీ॥ ఒకరినీవు నన్నాడెడి యూషరోక్తు, లెన్ని భూషణోక్తుల జనియింపఁజేసెఁ
గాక నేనెంతవాఁడ నతరివిగణంబు, నన్నుఁ బొగడుట కోయవినయధురీణ.

ఉ॥ వందల లెక్కి యేమకట? వారక లక్షలు వచ్చుఁగాక యే
పందయుఁ దండ్రిపేరు గురువర్యునిపేరును మార్చి చెప్పఁ డీ
చందను లందొకానొకటి సాధ్యము గాఁ గనుపట్టె నీకు, ము
న్నెందిఁక నొక్కటింక నొక మాటకు సాధ్యము చేయునోక దే?.

మ॥ అలనారాయణశాస్త్రి నీ వెఱుఁగుదే! యన్నాఁత నవ్వారికిన్
దల వంకించి యెఱుంగుటన్ దెలిపెదో! తత్పూనుఁడ న్నే నటం

---

మ్ము చేయఁగా, తిరుపతివెంకటేశకవిధీరుల శిష్యుల మంచు మించు సం, బరమున
నాత్మశుద్ధిమెయిఁ బల్కిన సేల్కవితావధూటి మీ, పరమయి యింపునింపు గురు
వర్యులకుం దగుశిష్యులంచు మి, మ్మరయుదు రాదరింత్రు ప్రజలందఱు దాన య
శంబుమీకుఁ జే, కుఱు గురువర్యులన్ మిగులఁ గూరిమిమీఱ మిముం దలఁతు రీ,
శ్వరుఁడును మెచ్చు మేముఁ గడుసంబరముం బడువార మేమియుం, బొరయును
బొచ్చెముం గలుగఁ బోదు యథార్థముఁ జెప్పినాఁడ న, కల్లఱిగొని నాఁడు పల్కి
వినఁ గల్గిరయేనియు నాఁటనాఁట దు, ష్కర నిరవద్య హృద్యశతఘంట మహాక
వితాలతాంతవాం, కురములు వాడిపోక చెలఁగున్ మెలఁగుం బలుతావులందు ము
మ్మరముగ నల్లిబిల్లిగొని మంజులపుం జిగురాకు లెత్తి క్రొం, బరిమళముల్ వెలార్చు
కుసుమమ్ములఁ బేరిమిగాంచి మిమ్ములం, బరిణత సత్ఫలమ్ముల ననారతముం దని
యించుచుండెమన్. మ॥ తలకెక్కెం గరువమ్ము మీఁ డెవఁడురా! ధైర్యమ్ముమై
మాకుఁ దప్పులు నొవ్వల్ గణుతింపఁబూనెఁ దలవంపుల్ కావలెన్ వీనికం,
చలుకం జూడఁ దలంతురేని యొకలెక్కన్ నేనుపాధ్యాయునిం, దలదాఁటం ద
లపెట్టు మీకు భయమంచన్ రామకృష్ణాహ్వయుల్. శా॥ తేటల్ దేరిన సత్కవి
త్వమునఁ గీర్తిం గాంచుచున్నట్టి మీ, బోఁటుల్ యత్కవితామృతాంబుధికి నం
భోదంబులై రానిరా, మాటుల్ తిర్పతివేంకటేశ్వరులకుం గారాపుశిష్యుండ నా
మాటల్ కొంచెము లీనులన్ జొనుపుఁడీ మన్నించుఁడీ వేఁడెదన్.—

చ॥ జనకుని పేరు డాఁచినను సత్సభ నంతగ శంక రాద త
ద్దినమునఁ దండ్రి యెట్లొ సభ దేశికుఁ డట్టిఁడె యెట్టు డాఁచఁ గాఁ
జను గురుపేరు? నీకెఱుక చాలక కీరితి కిట్లు డాఁచితె
ట్లును బయలెక్కెఁ గన్గొనుము లోకము మాయను మాకు దున్నదే. ౧౯౧

---

తి వినందగుయత్నము సల్పుచుంచునన్, లోకులు ప్రోత్సహింపజన లోలుఁడనైతి తపర్చుకొంటిఁజా, మ్మా శ్రీకవిపాలవేంకటకుమారకుమోంపతి సూర్యరాట్పుత్రభూ! ౧-౨

ఇట్లు

విన్నవించుకవి, రాజవిధేయుఁడు

ద్విభాషిపుల్లకవి, దుగ్గాడ, గోదావరిజిల్లా.

ఉ॥ మోకగనున్న నాఁడు గని ముచ్చటచే రసముంచి పెంచితీ, వోకవిరాజ! సద్గుణకళో దయశాలివి గాన దానికిం, పాకసమాఖ్య వృద్ధి గనుపట్టునఁ దాఁగనుపట్టెనెట్టనన్, నీకెది పోలకున్న నిఁక నేర్తురె యన్యులు మిన్నకుండఁగన్ ఆ॥ వె॥ ఉభయశాస్త్రములని కాక యుపరిశాస్త్ర, మొండు నుపదేశమాత్రన యూహ సేయఁ, జాలియును జాల పింతకు మేలిగురులఁ, దిట్టినారెత్తుకోయిల దిట్టతనము, ఉ॥ మాయురె! చంద్రుఁ బోల్చికొన మంచిదలఁపక కప్పు, తద్గ్రహ, పాయము తీర్థతల్పగతి పాయని కార్శ్యము గొన్న తెన్నునన్, గోయిలలంగృతఘ్నతయుఁ, గుత్సిత వృత్తి, మలీమసత్వమున్, గూయుచుఁ బాటిపోవుటయుఁ గూర్చిరె మేలిగొనాలు నేఁటికిన్. తే॥ గీ॥ కాకి బలఁగమె? చిలుకలకదు పొరియంచ, పిండువో యున్న చోటనె యుండి కణము, లేర్చికొనుగతి గన్గొన నెఱుకవడదె, లేదు కాఁబోలు నిపుడు బలిప్రసక్తి. క॥ కోరు నకించనుఁడెన్నియొ, కోరికె లటిగూడునెట్లు గురుభారాప్తిన్, వేరులు దెగెమును నీతో, వేరంబున నింకనున్న వేరులు దెగవే. తే॥ గీ॥ కొంగ మల్లాయ గట్టునఁ గూలఁబడిన, కుంటు నే వచ్చినను దప్పకొనఁగఁ బోల, దిప్పుడే తెచ్చినవి పెట్టి యేగుఁడన్న, గతియకనుపట్టె నళకెక్కఁ గాంచు టెట్లు. తే॥ గీ॥ చాలుదును చాలనోమానఁ జాలనీఁదఁ, జాలఁ జాలుదు నేనెట్లు చాలుదునని, శంకలనెమున్నవైరి విశంకట ప్రవృత్తి, వర్ధమాన భవతీర్థ వాహినిఁగని. తే॥ గీ॥ ఇలచుఁ బోరియొండుమించుభవత్ప్రతిష్ఠఁ, దీర్పునే వానికోర్కెఁ బలిప్రభయది, కెలనఁ గలనీటి జాలాంది బలిసి వల్వ, లంబు మానసలక్ష్మీవిలాసి యగునె.

ఉ॥ శాకము మీఁదఁ బెట్టియిటు శాఖలు మీఱుటకన్నఁ జక్కఁగా
నాకు గురుండె యౌతఁ డని నన్ను వచించినయంత నిన్ను సు
శ్లోకులు కొట్టిరే! నృపతి సూరిగ నొప్పఁడె? యిప్పుడేని యీ
పాకము నేర్చికొమ్ము గుణవంతుల మెప్పును గొమ్ము పుత్రికా. ౧౯౩

---

రంబని చూడక, కృత విద్యలు నేర్పు వెంకటేశ్వరగురుతో, విపరీతబుద్ధిఁ గల హం, బు పెట్టికొంట దగదెందు, నుత్పగుఁజూండీ. మ॥ బహురాజన్య సభాంగణంబులను దుర్వారకౌర్యాదక్షులై, మహిమన్ బెక్కు శతావధానములు సంభావ్యంముగాఁ జెప్పలో, కవీంతుల్ తిర్పతి వేంకటేశ్వరులతోఁ గాల్దువ్వికయ్యానకున్, సహానంబున్ విడనాడి లోఁగు టిది యేచాతుర్యమో తెల్పుఁడీ. ఉ॥ తిరుపతి వేంకటేశ కవిధీరులకంటెను మీరు పాండితీ, గరిమను గొప్పవారో! మఱి, కారో యెఱుంగను గాని వారితో, సరిగఁ గవిత్వమున్ నెఱవఁ జాలినవారని యెన్నఁ జాలనీ, తెరపునఁ బల్కఁ గాఁడనని, తిట్టకుఁడీ భవదీయమిత్రుఁడన్. తే॥ తెలియ మీకంటె వారల ధికులో లేక, వారికంటె మీరె ఘనులో, ధీరులైన; పెద్దలనుకొనవలెఁ గాక పృథగ్విల్లు. వాదులాడుకొను టేమిలాభంబు చెప్పుఁడీ. క॥ మీగుసవర్థులు కారని, యేరును వచియింపరెక్కు, వేయగుబురుగా, కీర్తిగురుల నెదురుట, ధారుణి నేనెందుఁ జూడ, ధర్మంబిదియే. శా॥ సర్వజ్ఞుల్ బలరామకృష్ణులెమునున్, సాందీపుతో విద్యలన్, సర్వంబున్ గ్రహియించి వర్తిలి ప్టఁ తన్నఁబురూపేర్పడన్, గుర్వంగీకరణంబు సల్పుటలు మీకున్ సద్బుద్ధున్నన్ సరే, గర్వస్ఫూర్తిఁ జరించి దేశికునితోఁ గాట్లాఁడగా నొప్పనే. ఉ॥ తప్పొక వేళ మీగురుని, దగ్గఱనుండిననుండుఁ గాక యా, తప్పను సైఁచియుండినను, దప్పక మెప్పును బొందముందురే, తప్పను జేసినారనుచుఁ, దద్దయుఁ జెప్పఁగ నయ్యెనిర్ద్యైడన్, దప్పత్తుయించు దేశికపదఁబులు పట్టిన మీకు బాలకుల్. మ॥ అరయన్ దేశికదేవధిక్కరణ శ్రీయసాఁమలైనట్టిమి, వ్వరికిన్ గూడ దటంచుఁ జెప్పవలెనా? ప్రజ్ఞావిశేషంబునన్, గురుఁడేమాడఁగ వేంకటేశకవినో, గుర్వల్ మెచ్చమీరింకమీ, గురుపాదంబులుపట్టి, బాగుపడుఁడీ, క్రోధంబులోఁ ద్రిమ్మంగుచున్. మ॥ భయమున్ భక్తియుఁ దారతమ్యమును వి, శ్వాసంబులేనట్టి దు, ర్నయులౌ నేఁటియపూర్వనాగరులము, ర్యాదన్ బురే! మీరు, ర్జయులౌ తిర్పతివేంకటేశ్వరులతో సాహిత్యసంవాదమా, శయమందెంచుడి మెప్పగొల్పునె! యశ స్సంపన్నులన్ జేయునే.

ఉ॥ వంకరత్రోవ లెన్నఁటికి వంకరత్రోవలె యందుఁ జొచ్చెనా!
శంకరుఁడేనిఁ బేరుగనఁ జాలఁడు చక్కనిత్రోవఁ బోవు మీ
వెంకనగారి పట్టుదల వేల్పులు నైతము ద్రిప్పఁ జాలరో
వెంకటరామశాస్త్రి! యవివేకి వెఱ్ఱైతి వెఱింగి సర్వమున్. ౧౯౪

ఉ॥ శ్రీ కలచోట నప్పగొని చెచ్చెర దీర్పక మానెనేని త
త్పాకము గారణంబుగను దద్గృహ మందెటులో జనించు సన్
వాతులు సత్య మయ్యెఁ జామి నాఋణమున్ నను గాకిఁ జేసి నా
వాకిటఁ గోకిలంబ వయి వహ్వారె? తీర్చితి ముట్టెఁ బుత్రికా. ౧౯౫

క॥ అప్ప గొని తీర్పకుండిన, యప్పురుషుఁడు కుక్క యగుట యనుభవ సిద్ధం
బిప్పుడు కోకిల లగు టిది, తప్పదు కలికాలనూత్న ధర్మంబు సుతా. ౧౯౬

---

ఉ॥ శ్రీపద కృష్ణమూర్తికవిశేఖరు సన్నిధి మీగురుండు వి, ద్యాపఠనంబు చేసి నది, యారయ మాసచతుష్కమయ్యె? సం, దీపితబుద్ధి నాతనిని దేశికుఁడంచును జెప్పుచుండు "నే, నేకగిరిన్ గురుం డగుదునీతని"కంచు వచించునాతఁడున్. ఉ॥ చదువుట లేదుగాని నిజ, సంశయముల్ దఁగదీర్పు కొంటకై, వదెఁ బదెకృష్ణశాస్త్రిక విపర్యుని యింటికిఁ జాలకాలమున్, గురురుగఁ బోవుహేతువునఁ గూర్మియు భక్తియు మీఱనిచ్చలున్. మది గణియింతు సమ్మతిని మద్గురుగా నతనిన్ గళానిధుల్! చ॥ గురుఁడెటువంటి వాఁడయినఁ, గూడదు దూషణచేయ దానిచేఁ దొలఁగు యశంబు పుణ్యమని, తొల్లిటి పెద్దలు చెప్పలిందు మీ, కరణిఁ జరింపనేల గురు, గా గణియించుట కేమి వేంకటే, శ్వరకవి చాలఁడొక్కొ? యవిచారపు పోకలు పోవనేటికిన్. శా॥ ఏలా! పెద్దలతో విరోధపడి మీ, రీరీతిఁ బోరాడుటల్, మేలా! చూడ వివేకమింతవలదే?, మీశ్రేయ మర్థించి యే, మీలో నొక్కని నేనెఱుంగుటను బే, ర్మిన్ బోధ గావించితిన్, బాలత్వంబును వీడి బాగుపడుఁడీ, స్పర్థాళువుల్ గాకుఁడీ.

బరంపురనివాసి,
గాదె శ్రీజగన్నాథస్వామి.

---

బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వర శతావధానుల సన్నిధికి.

తమగిరతముచూచి శ్రీరామకృష్ణకవులఁ గూర్చి యీక్రిందిపద్యములవ్రాసియభినవసరస్వతీపత్రికకంపియుంటిమి తాము చిత్తగింతురని సమ్ముఖమునకు పంపితిమి

"...మ॥ అరుదెంచెన్ గద రామకృష్ణకవులారా! సర్వదిగ్దేశ నా, స్వరసాంద్రాంశుకవిత్వకీర్తినిచయశ్యామాయమానోహ రు లె, వ్వరొ? ఆ తిర్పతివేంకటేశకవి

## (8) గీరతప్రశంసాపర్వము.

ఉ॥ శ్రీగీరత మన్న యిట్టికృతికిన్ భవదీయ విజృంభణంబె మూ
లారణ మయ్యె నిక్కముతనఁ గల్గినలాభ మపారి నాకు, నీ
పేరిటఁగాదె యిట్టిఘనకవిత్వము చెప్పితి నాకు నైజమిం
తారును దీనిబోలె నెఱదాత యటంచును దోఁచ దర్థిగా. ౧౯౭

తాఁ బ్రాంచద్ఘనురుర్మ్రక్తమై, వరఁగంగాఁగల గీరతప్రవర మబ్బా! యెల్లనైరింతురో? మ॥ మనమున్ డాఁచియుఁ బల్కుబుద్ధియ నిజంబున్ బల్కవారింబలేన్, జిన పాత్రంబుల వెల్లడించితిరి నష్టీభూతచిత్తమ్ములతోఁ, గనియాలించిన సత్య మంద నువదంగాఁ బోదె? మా యెంతకై, నను వెనకంగను వేయఁ బోవరుగదన్నా? మీరువిద్వత్కృతుల్,, సీ॥ తాలుకుట్టినమునఁ దగశివరామశాస్త్రి గణిగ అవునయంబునుంచి, గౌరవంబుగను వేటూరి ప్రభాకర శాస్త్రిగారులఁ దెల్ప జాఅవిడిచి, శక్తియున్నట్టిచో సభలోని కేతెందురందురెందన్నదూరంబుతొలఁగి, గురుశిష్యులకును సొగ్గులు పనికిరావని వచియించుపెద్దలకలుకు వదలి. గీ॥ గీరతామ్నాయనేతృత్వధీరులగుట, కనుమతించితిరే? శశాంకాబ్జమిత్రు, లుండునందాఁక మీకతలుండకున్నె? యూరకేగుసై? గురునితోఁ గేరడములు. సీ॥ గుళికాత్రయంబుతోఁ గుంటుశతఘ్నిని బాణశతంబట్టె పాఱందోలె, కవితావిమర్శనఖండనమ్మునకు సర్వాంగముండనమట్టె యల్లుకొనియె, కాకవిగాజాపింగాణిబుడ్డుల జీల్గు బెండులమేకుతోఁ బీఁకు టాయె, ప్రదేశమిష్టమా యొత్తఁగింపుఁ దీనఖ, కననిరుత్తర మునఁజనుటయయ్యె. గీ॥ శక్తిలోఁ దారతమ్యంబు చాటనయ్యె, కవితలోఁదారతమ్యంబు గాంచనయ్యె, నింకనీమూఱువేసంబు లెన్నివేఁకి, నిజము దాఁపఁగనుంటిరో సుజనులార. ఉ॥ రెండవభాగమిచ్చు ప్రచురింపగనుండిరి గీరతంబిఁకన్, రెండు మనమ్ములట్టుక చలింపక యుండినలాభమేమి? మీ, పాండితిబైటఁబెట్టఁదలఁపన్ దగునిత్తఱి నూరకున్న నై, వ్వండయినన్ హసింపఁడో? ప్రాజ్ఞులు మీరటు సైఁచనేర్తురో?.

దూపాటి తిరుమలశేషాచార్యులు.

ఇట్లుసోదరులు. వెంకటరమణాచార్యులు

---

ఆనందబాగ్; వేపరీ

మదరాసు. 19-12-11

......శ్రీగీరతము కొంత భాగమయిన నచ్చుపడి యుండినచో సెల ప్రతి పంపఁ గోరెదను.

చిత్తగింపుఁడు.

జి. రామయ్య.

క॥ ఒకగంట నేను వ్రాసెడి, చకచక కొకవత్సరంబు చాలదు నీకున్
బకబక లాడుచు వాదము, నకు దిగకుము మంచిత్రోవ నడుపుము పుత్రా.

క॥ గర్వి యనుచు లోకులు నను, నిర్వచనము సేయ నిమ్ము వినుఁ బోలెడిగం
ధర్వుఁడు శిష్యుఁడు దొరకిన, గర్విని బాలకుఁడుఁ గూడఁ గావచ్చుఁగదా!

---

శ్రీరాములు.

శుభమస్తు.

తే॥ అయ్యరో! తమగీరతము కొఱకాది కాల, మందె యొకపద్యమాలిక నంపుకొంటి, నందు నాకుఁగలట్టి యిబ్బంది కతన, సాము వెలకిండటంటి మీస్వాంత మంటి. మ॥ జనియించున్ మఖుఁ, బుబ్బులోనవమయున్ స్వామీ! బహుగ్రంథముల్, కనఁగా ననన్యకృతంబులౌర! తమవో! త్స్మభానక్రాబ్జర్షముల్, కనదుదగ్రరుచిఁ బొల్పు నంతవఱకున్ గ్రాలున్, రసారామమై, ఘనమోద ప్రదమై చవుల్ గొలుపు వేడ్కన్ శేర్మి సారించుటన్. సీ॥ అవధాన విద్యామహాశాఖ నింతింత వారినెక్కించిన ధీరమణులు, రసవత్ప్రబంధనిర్మాణ చాతుర్యధుర్యుల నెల్లరను జేయు లలితకవను, లుద్దండ భాషాద్వయాద్దామసాహితీ వతుల నెల్లరఁ జేయు ప్రౌఢగురులు, బహుచమత్కృతి యుక్త భాషణోపన్యాస పటిమ నందఱికిచ్చు పటువచస్కు, లరయఁ దిరుపతి వేంకటేశ్వరకవీంద్రు, లే యటంచు మహాల్లోకమెల్లనుడువ, వాసిఁగాంచిన కవితా విలాసులార, దివ్యతర భవ్య కావ్య వర్ధిష్ణులార! మ॥ అతినీతి ప్రదమై రసప్రచురమై యాహ్లాదసంధాయియై, మతి మత్సత్రావి హృత్క్రజారక్రనమమై, మాయాలతా ప్రాభవ, స్థితిదూరంబయి యొప్ప గీరతము భక్తిన్ మ్రొక్కి నాకిష్టు మీర్, కృతికృచ్ఛేఖరులార; వంపుఁడు దయా శ్రీ చేతఁ బైరీతిగన్. చ॥ చదువ భవత్ప్రబంధములు చక్కని సాహితినీయఁ జాలువెం, పొదవరసాచితిన్ దెలుపు యోగ్యతమంబగు వృత్తినిచ్చు, న, మ్మదమెద శెక్కఁ జేయఁ బదమాచిదను ప్రీతిభన్ ఘటించు శ్రీ, వదకమల ప్రభారుచిర బాపురె! శ్రీపతి వేంకటేశ్వరా.

ఇట్లు విధేయుఁడు.
శిష్ట్లా వేంకటసుబ్బశాస్త్రి,
పొన్నూరు పోస్టు, గరికపాడు.

ది 31-7-1913

క॥ ఎవ రిచ్చిరి కవితను నీ, కవనీపాలకత యంచు నన వత్తువె! తా
రెవ రిడిరి సింగమునకు న, టవిలో రాజ్యమ్ము మృగపటలములమీఁదన్.

---

......మ॥ శ్రవణానంద ముఖ్యప్రబంధముల నీక్ష్మామండలిన్ నించి న, త్కవిమూర్ధన్యుల మెప్పుఁ గాంచి సుకవిశ్రీవ్యాప్త వైకుంఠులై, భవదక్ష్మీకృత శాకరంబులయి శుంభద్భోగభాగ్యోదయ, స్థవిరత్వంబున వెల్గుమీ కెఱఁగెదన్ సర్వశ్రేయసప్రాప్తికై. శా॥ బాపట్లాది సమస్తపట్టణములన్ ప్రాజ్ఞుల్ మిముఁ వేఁడఁగా, మేపట్టోగ్రహించి గీరతమునం దించించుకే దెల్పనే, నాపట్లన్ విని నీతిబోధక కథావ్యాహారమౌ గీరతం, బీపట్లన్ దయచేయ వేఁడెదను స్వామీ వీ. పి. గా గ్రక్కునన్.

ఇట్లు సుధీకవివిధేయుఁడు

25-5-1912. శ్రీరామకవి పుత్రుఁడు జమ్ములమడక కోటయ్య శాస్త్రి.

---

......చ॥ పరిణత సత్కవిత్వ గుణబంధురమై, గురుసత్కృపాస్ఫుర, ద్గురువర గౌరవ ప్రతిభకున్ ముకురంబయి; కల్మషాత్మధి, క్కరణ ధురీణమై, విబుధ కాండనుతంబయి, యొప్పు గీరతం, బెరఁగెడు నాకు వేంకటకవీంద్ర; దయామతిఁ బంపవేఁడెదన్...క॥ మీయంతటి మహనీయులె, యీయెడ గీరతము వ్రాయ కెడగానున్నన్, గూయవె గుంజలు సైతముఁ, బాయవె తలిదండ్రులన్న భావము లైనన్.

తలివేటి వేంకటనరసింహము

ది30-7-1912 కొండపాటూరు, బాపట్లపోస్టు.

......ఉ॥ (పంచపాది.) తిక్కన సోమయాజికవి ధీవర కల్పితమైన భారతం, బొక్కటి దక్కనింకొకటి బోధనయు సేనెనీతులంచు నే, నెక్కుడుగాఁ దలంచ నొకనెచ్చెలి యిచ్చటి కేగుదెంచి నీ, వెక్కుడుగాఁ దలంతువది వెల్లడియయ్యెను గీరతంబునం, దెక్కుడు ధర్మమార్గములు, తేటతెలుంగని తెల్పెనంతటన్ ...
......గీరతము 1 న్ని...వెరశి మూడు గ్రంథములు వి. పి. గా బంపించవలయునని మీఘనతను మిక్కిలి ప్రార్థిస్తూ యున్నాఁడను.

శనగల గోపాలకృష్ణయ్యవార్లు.

12-7-1912 పెదనందిపాడు.

క॥ గర్వం బెదిగెనుగా! నా,గర్వము, చూచెదవుగాక, శాస్త్రి రాదే
సర్వాహంకృతివారణ, పూర్వహ మగుసభ నొకండు దులిపెద రిక్రుల్.

క॥ ఎవరిడిరి జోడుకాగడ, లవినీతుఁడ, నీకునని "నా ముదవుం జే
నివి యొసఁగె" ననుచుఁ జెప్పిన, యవివేకికిఁగాకి నెఱుఁగుమన్న యటంచున్

---

శ్రీశివాయనమః

సరసవచః ప్రసార కవిచంద్రమహత్తర సంస్తవాకరో, త్తరగుణ భవ్యది
వ్య కవితా ఘనతాభిమతాత్మభావలి, స్ఫురణ పరీతులార? పరిపూర్ణయశః పరి
వారులార? శ్రీ, తిరుపతివేంకటేశకవిధీర వతంసములార? మీకు నే, నెఱఁగి త్రి
యావిధిన్ బుధ హృద్దీప్సితలక్షణ లక్ష్యధార నం, భరితము నీతిదాయకము ప్రా
జ్ఞ గురూత్తమ శిష్యవృత్తి నం, స్ఫురణ ధురీణసంఘజన సన్నుతిపాత్ర మరిత్రి
పా, తిర స్ఫురణచణ ప్రచారణము సారపదర్థ సమర్థశబ్ద నం, చరణము తత్త
దుత్తమ రసప్రతి భాగతిభాసితంబునై, పరఁగెడు గీరతమ్మొకఁడు బంపఁగ మిమ్ము
నతమ్ము వేఁడెదన్.

అయ్యాః పైనవ్రాయఁబడిన పద్యపూర్వకనమస్కృతిని చిత్తగించి అచ్చు
పడినంతనెఱకు గీరతమ్ము వి. పి. ద్వారా నాకు పంపగోరుచున్నాడ.

విధేయుడు
జమ్ములమడక శ్రీరాములు.
బాపట్లాతాలూకా, బాపట్లపోస్టు
కొండపాటూరు.

---

శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి వారి సన్నిధిని వున్న ఆస్థాన పం
డితులు ధేరం మహాదేవ శాస్త్రిగారున్ను, యింకావున్న శ్రీస్వామివారి సవుకర్లు
న్ను, మీగ్రంథములు అన్ని చూచేనిమిత్తం కుతూహలులై యుండి అందులో
గీరతమందు చాలా ఆసక్తితో వున్నారు ...తప్పక ప్రస్తుతం గీరతము పంపించ
కోరుచున్నాను.

చామర్తి జగ్గారావు, బెండపూడి.

---

......క॥ ఘుంటాశత పథముల మం, చంటారఁటలోకమెంతకైనఁదగుసుము,
కొంటని సేసని యొకఁడిటుఁ, గొంటి ........బొట్టుపెట్టి గోలయొనర్చెన్.

చ॥ ఉడుగక వ్రాసి తెందులతో యొజ్జలకున్ "గురుఁ డాతఁ డంచు నే
నొదువక యున్న శిష్యుఁ డని నూటికిఁ గోటికిఁగూడ నీవు నై
ప్పైడునది చాలదే" యనుట పెంకెతనం బిది, "యింటివాఁడు పే
రిడి యిది గొడ్డుగేద" యన నింకొకఁ డాడునె పాడి గేదగన్.

---

... ... శా॥ గంగోత్తుంగతరంగఘుంఘుమరవాకారానుకార్యార్భటీ, భంగిన్ ద్రాక్షగుళుచ్ఛవిస్ఫురితరసప్రచ్ఛన్నవేషంబు మీ. సాంగత్యమ్మునఁ బొల్చు సత్కవితకే, చందంబునన్ సాటి? భూ, మిం గ్రీఁగంటిప్రసార శూన్యకవితా మీనాత్ము లూహింపఁగన్.........ఇట్లు జూపూడి,హనుమచ్ఛాస్త్రి, శతావధాని.

చ॥ చదువుడు సూరనాది కవిచంద్ర పటుత్వ కవిత్వసారమున్, ముద మొంద నూరుచుండ మనసు మున్నిఁక నెప్పుడు గూడ నబ్బె నా, హృదయము గీరతామృత మొకింత చవింగొను నాఁటఁగోలెఁ బా, యదురుచి సర్వకాల మధురా? కవనం బిటులుండు టొప్పదే.

ఇట్లు విన్నవించి నమస్కరించు
విధేయుఁడు
భమిడిపల్లి సీతారామయ్య.

ఆర్యాపురము,
రాజమహేంద్రవరము 18-1-1913

---

......నవీనముగా రచింపబడిన పంచమ వేద ప్రతిమానంబగు గీరతంబును దయచేయించ గలందులకు ప్రార్థన చేసుకొన్నాను.

నరసింహదేవర గవరయ్య
సా॥ వెలగదుర్రు, తణుకుతాలూకా.

---

(1)...కలకత్తా చేరినాను, తమగీరతము వినవలయునని యిచ్చటి యాంధ్రవిద్యార్థులందఱు నువ్విళ్లూరుచున్నారు. కాన యీజాబు చూచినవెంటనే తమగీరతము నీక్రింది విలాసమునకు పంప బ్రార్థించుచున్నాను.
(2)...గీరతమును శిరసావహించితిని ఆగ్రంథరాజము నొకసారి చదివి తనివిదీరక యవకాశము చిక్కినప్పుడెల్ల నందలి భాగముల మాటిమాటికిం జదివి యానందించుచుంటిని.

Cantu Subbavadhany
191 Bow Bazar
Callutta

క॥ కలరెందఱేని శిష్యులు, కలిలో నాకుఁ బలె నితరకవులకు మఱి వా
రలకుఁ గా వారికిఁ గలహము, గలుగని దెటు! నీకు నాకుఁ గలిగిన దెట్టుల్.

సీ॥ నారాయణాస్త్రమ్మునకు నమస్కారమ్ము శ్రీకృష్ణుఁ డానాఁడు చేయలేదె
భీష్మసాయకవహ్ని బిట్టేర్చి మండంగఁ గృష్ణుని ప్రతిన చెట్టెక్కలేదె,!

---

......గీరత సందర్శనార్థమై చంద్రచకోర న్యాయముగా వేచుచున్నాడను.
వేగిరమంపఁ గోరెదను.
చిత్తగించవలెను.

K. V. Kristna Rao

చీరాల ది 30-6-12

......గీరతము అను మహాగ్రంథమును వకటి నాకు పంపఁగోరుచున్నాను యీగీర
తము నేను చదివి జన్మసాఫల్యము చేసుకొనుటకై వ్రాసుకోవడమయినది.

తేలప్రోలు సుబ్బారావు వ్రాలు.

---

......మ॥ వెన్నంబోలిన మీకవిత్వ మొకబల్ విందయ్యె మిమ్మెవ్వడే, గన్నా
రంగని నే భవన్మధుర వాగ్వ్యాఖ్యానవ్యాలోక నో, త్పన్నానంద విచిత్రచారు
మణి సౌధంబెక్కఁ గాంక్షింతు ర, మ్మన్నన్ వచ్చెదఁ జెళ్లపిళ్ల వరవంశాగ్రణ్య
ముక్తామణీ. సీ॥ అష్టావధానశతావధానము లనువనిచిన్ననాఁడె నేర్చినది కాదె
వాగ్వాదమందు విద్వాంసులగెల్చుట కరతలస్థామలకమ్ము కాదె, రసవత్ప్రబం
ధ నిర్మాణ చాతుర్యమ్ము తమకు స్వార్జితమైన ధనము కాదె, దిక్పథసంచర
త్కీర్తి మీకొక స్వయంవరలబ్ధయౌ ధర్మపత్ని కాదె, గీ॥ యనుచు నుతులను సా
మాన్యజనమె కాదు, వైరులకునైనఁ జేయక తీరదనుచు, నాకుఁదోఁచెను సత్కవిలో
కతిలక, వేంకటేశ్వర కవివర్య! వినుతచర్య. చ॥ మఱియొక చిన్నవిన్నపము
మన్నన చేసెదరంచు నెంచి యి, త్తెలుఁగున వేఁడుచుంటి భవదీయకృతివ్రజముం
దు సత్ప్రథా, కిరదకలంకసంఘటితగీరతముం బరికింప వేంకటే, శ్వరకవివ
ర్య! మీకృతులు సర్వముఁ జూడఁగ వేడ్క యయ్యెడిన్.

ఇట్లు ఆకొండి వెంకటశాస్త్రి
బొబ్బిలి సంస్కృతపాఠశాలాపండితుఁడు.

---

పదునెన్మిదవశతాబ్ది పదుచుపాటునిబారి కెదఁగొంకి పాడఁడే కృష్ణుఁ డెటకొ,
సైంధవశతకు నాచార్య మౌక్తికముండఁడే శ్రీకృష్ణుఁ డా నాఁడు క్రీడిచేత,
తే॥గీ॥ నిజముగానాకుసామ్యంబునీదుబాత, మటఁదికృష్ణునకున్న సమ్మోహనగుణము,
కూడ నున్నను గీర్తి చేకూఱనీఁడు, ఎట్టులో నిన్నుఁ గాపాడి యేమిఫలము.

---

......ఆ. వి. పి, సంతోష పూర్వకముగా 1-8-0 చెల్లించి పుచ్చుకొని గీరతంచదివి పరమానందమును పొందినాను. రెండవ భాగముకూడా త్వరలో అచ్చువేయించి పంపించ గలందులకు కోరుచున్నాను. మ॥ రా॥ శ్రీ. వె॥ రా॥ గ్రంథమాలద్వితీయ గుచ్ఛకములో శృంగభంగమందు (5)వ పుట కడపటిఉత్పలం "కాముడఁ జేతఁబట్టి"యను పద్యము మొదలు నాలుగు పద్యములుచదివినంతనే వారిపాత్రలయందు సందేహముతో నుండిన మమ్మును మీ గీరతమువల్లను సంశయ నివృత్తి చేసినందుకు చాలా సంతోషముగా నున్నాను.

P. Ganardanam, Naidu.
Baruva Post
Ganjam District.

---

కేశ్నకుర్తి, ముమ్మిడివరం పోస్టు. ఆకొండి సుబ్రహ్మణ్యం కృతానేక నమస్కారములు.

......గీరతం అచ్చుపడినట్టుగానే పంపిస్తామని వ్రాసినారు కాబట్టి అచ్చుపడినట్టు

---

విన్నాను:...యీ గీరతంలో సర్వాంశములున్ను పున్నవనిన్ని బహుబాగా వున్నదనిన్ని, చూచినవారు చెప్పడంచేత నాకు చాలా కుతూహలంగావుండి యీ వుత్తరం వ్రాసినాను గాన ముఖ్యముగా పంపించకోరుతాను.

దీ14-10-12. ఆ॥ సుబ్రహ్మణ్యం.

---

Nuzvid. 28-7-1912

......గీరతము ఇప్పటివరకు కొంతచదివితిని. యింతవరకు నాకు తీసివేయవలసినపద్య మొకటియు కనుపడలేదు. ఇది నాయొక్క నిశ్చయమైన యభిప్రాయము. (తమయొక్క) గీరతములో 34వ పేజీలో "కృతి" యన్న కంద పద్యములో ప్రాసపోయినటులు నాకుతోచినది. నారయ్యప్పారావు

సీ॥ సకలాగమాంతసంచారి యాకృష్ణుండు సకలాగమాంతసంచారి యితఁడు,
పరమ సత్యాసక్త భావుఁ డాకృష్ణుండు పరమ సత్యాసక్త భావుఁ డితఁడు,
గాంగేయగౌరవాక్రాంతుఁడా కృష్ణుండు గాంగేయగౌరవాక్రాంతుఁడితఁడు
పూతనానాశనస్ఫీతుఁ డాకృష్ణుండు పూతనానాశనస్ఫీతుఁ డితఁడు.

---

అయ్యా! 12-7-12, చిత్రాడ.

తమరు పంపించిన గీరతము అందినది. గ్రంథంబు చదివినకొలది మాయుల్లంబుతరిమితానందవార్ధిఁ దేలుచుండె, పంచమవేదం బనంబడుభారతంబురీతి మీగీరత పుస్తకంబు పెక్కునీతులచే విరాజిల్లుచుండె. తక్కిన భాగంబులుకూడ అచ్చుపడిన వెంటనే పంపించగోరెదను. తమరు కావించిన శతావధానగ్రంథములన్నియు వి. పి. గా పంపించకోరెదను. ఇట్లువిధేయుడు

చెలికాని, లచ్చారావు.

12-1-1911, Bezvada.

శా॥ అయ్యా! మీరగు శిష్యకోటికిఁ బ్రశిష్యప్రాయుఁడౌ వీరమ, ల్లయ్యాఖ్యుండు వచించు విన్నపము మీయాంతర్యమందుం గొనుం, డయ్యా! యీయన మానకత్త తమబోంట్లా పూనుటే? టారామకృ, ష్ణయ్యల్ పిన్నలు సర్వధర్మముల, మీరైనన్ గృపన్ మానుఁడీ. ఉ॥ వారలతప్పు తొల్త గురువర్యుల నెన్నకయుంట పిమ్మటన్, దూఱుట; రెంటిలో మొదటి దోసము తప్పని వారెఱుప్పిరా?, వేఱొకదోసమో? తమరు వేసము పోషణ సేసికొంటకా, దారినిఁ బోయిరందులకుఁ పగ్గ చివాట్లిడిరంత చాలదే. తే॥ గీ॥ చాలు మూలయుఁ దగు ప్రమాణాలు లేని వ్యాసములమీఁద ద్వైపాయనార్యుఁ డటు వి, మర్శనము సేయుచున్నాఁడు మరల,మీరు, తగువిధమున శాంతింపుఁడు దయవహించి క॥ అత్తఱి వారిచ్చిన ప్రత్యుత్తరమును జూచువార లూహింపరె మీ, చిత్తమునకుఁ దోఁచదె! యీ, పొత్తసమానమ్మనుచును భూసుతు వీరల్. ఇట్లువిన్నవించు భవద్విధేయుఁడు,

కాశీనాథుని, వీరమల్లయ్య.

తే॥గీ॥ అర్థభేదమ్ము దక్క భేదత నికేతని, కెందు శబ్దంబు లోకగతినే పొసంగు,
నేర్చికొను మాతని గొనాలు నీకు నివ్వ వ, రంబులఁ బ్రతిష్ఠ కభ్యంతరంబు లేదు,

క॥ గోవర్ధనుఁ డాతండా, గోవర్ధనుఁ డితఁడు వీని కుచ్చితమే ని,
న్నీవిధిఁ ద్రిప్పెఁదవ్వుడు, శ్రోతలు నీవింత మనసుపెట్టుంగ వెట్టుఁగుడున్.

---

31-1-1911, గుంటూరు.

శుభము.

(1)...క॥ శ్రీతిరుపతి వేంకటకవి, భూతేశులు వినుఁడు నాయపూర్వపు మనవిన్, మీతెలుఁగు గీరతమ్ముకుఁ, బ్రీతిని నాకందఁ జేయుఁడీ వీ, పీ, గాన్. క॥ అప్పటికాభారతమిఁక, నిప్పటి కీగీరతంబు నెన్నో విషయాల్, సెప్పఁగ వెలువడెనని యెద, నెప్పుడు మాతునై యటంచు నేననుకొందున్. క॥ మీరు రచించిన రూపక, భారతభాగములఁ గాంచి ప్రజ మెచ్చెఁగదా, గీరతము నెల్లగాంచును, యారయ మీకవన మెవ్వ డనదృశమౌ కదా. ఉ॥ తొలుతటినుండి, తెల్గనినదూరము గాఁ జనువారు కూడ మీ, తెలుఁగుఁ బ్రబంధముల్ చదివి, దివ్యతరంబగు తెల్విఁ గాంచి పే, శలగతిఁ దెల్గుఁగబ్బముల నల్పఁగ సాగిరి కీర్తిఁ గాంచిరో, కులకెటు వంటి మేలు నమమూర్తిదివో కనుఁడీ భవత్కృతుల్. ఉ॥ ఎంతటి యూహ లేని లగియింపఁగ జేయుచుఁ బద్యమందుఁ గొం, డంతలు భావముల్ దెలుపు నట్టిపదంబులఁ గూర్చుచున్ గవి, తాద్వంతము సాహితీపద్ధతి నందిరచించి కృతుల్ ప్రధానముల్. వింతగఁ జేసి మీరు ప్రతిలేని యశంబును గంటి రిద్దరున్.

(2)...గీరతము కడపటిఁ జూచితిని సక్రమము. సధర్మము. ససందర్భము నై యున్నది. భారాప్వారస్యాదులకు మెచ్చనివారు ముందుపుట్టవలెను.

ఇట్లు శిష్టా మానుమచ్చాస్త్రి. గుఁటూరు.
తెల్గుపండితుఁడు, టౌను హైస్కూల్.

---

(1)...గీ॥ మీ కవిత్వమునన్ ఇనుమిన్నగునఁట? బహుకవుల చేతననున్నతుల్ వడసినదఁట? ప్రకృతులం గూడసంతోషపఱచినదఁట? భారతమునకుఁ బ్రియ గుగీరతంబు

(2).....మీరంపిన గీరతమందినది. దానిని సమగ్రముగా జూచినాను. వేంకటరా

ఉ॥ ద్రావిడులందు మూఁగురుగదా! గుణవంతులు, నేను వావరూప్
నీళ్ళను సర్దుకొందము "మనీములు నవ్వెడికూళ" తిర్పతిన్
జేవయెటుల్ ఘటించు! గురుశిష్యవినోదము లింత చక్కఁగా
నావలె నీవలెన్ దెలియునా! వెలనాఁటిశతావధానికిన్. ౨౦౮

మ కృష్ణకవులు పాండిత్య మెట్లున్నను అత్యద్భుత బిరుదుపొందిన వారఁటుగాఅట్టి వారికి శృంగభంగములు వ్రాయుట లెక్కలోనిది కాదు, మీగీరతమందు మాకు తెలిసిన విషయములు వారివిషయమై విను(ం)డు. (1) గురువును మఱచుట. (2)రిజ ష్టరుత్తరంతిరిప్పివేయుట. (3) చాటున పద్యములల్లుట, (4)వ్రాసినమాటకుబదులు వ్రాయకుండుట (5)శృంగభంగములు వ్రాయుట, మొదలయినవి గ్రహించితిమి. మార్గముఁజూపినను తెలిసికొనలేనివారితో నేమిసార్థకము.

చ॥ తిరుపతి మార్గ మిట్టిదని తెల్పఁగ వేంకట నాయకుండు త। ద్గిరివర మెక్కనాఁడిది యొగిన్ గనినారు సువర్ణముఖ్య లీ। తిరుపతి మార్గమిట్టిదని తెల్పితి వేంకటశాస్త్రివీవు త। ప్పురుషులు గాంచినా రిది బుధులు వారలు గాంచ నేర్తురే.

మీరు శృంగభంగములు వ్రాయుటయు, తక్కంగల్గు పండితమ్మన్యులుమీపైకివివాదమునకు రాల్గద్రువ్వుటయు చూడ మీకవితావనితా శుభసూచకము స్ఫురించుచున్నది. యెట్లన.

ఉ॥ క్షోణిజనమ్ము లందఱు విశుద్ధగతిన్ జరువంగ "నిత్యక, ళ్యాణముఁ బచ్చతోరణము పాయఁగ వెంకటనాథుఁ డందె మీ, రాణిసుకీర్తి సాధ్వియ దిరాపిడిచేసిన రాదు. నిత్య క. ళ్యాణముఁ బచ్చతోరణము పా యుటమీర్గొనినా రుదానిచే. తెలికేపల్లి, రామచంద్రయ్య, వేలూరు, చిల్కలూరిపేటపోస్టు.

......సీ॥ భాష్యముల్ వ్రాసినార్చి వలు పాత్రములానర్చి వలఱు శ్రీశంకర గురులుదక్క. వేదాల వివరించివేసవేల్గ్రంథమ్ముల్ వ్రాసుపు విద్యారణ్యమునులు దక్క, ఎనుబదికావ్యంబు లొనరించి శివభక్తవతియైనయప్పదీక్షితులు దక్క. తమి నూటనాల్గు కబ్బములల్లి కృతియైన నీలకంఠాచార్య మౌళిదక్క, తే॥గీ॥భూమినె వ్వారైననిన్నియా పుస్తకములఁ, జారుకవితరచించిరేమీరుదక్క, వెల్లవిల్లకులాంభోధి శీతపాద, నద్విసుత బోధ వేంకటశాస్త్రిబుధ....ఉ॥ గీరతమన్న సర్వగుణ కీలి

శా॥ శ్రీకృష్ణుం డుదయించు హేతువున సుశ్రీమించె రేపల్లె. నీ
యా కృష్ణుం డుదయించు హేతువున నోహో? యాకారపల్లీ సమా
ఖ్యాత గ్రామము దర్శశోభ్య దయ పారావారముఁ దాఁట లే
కేశాకారతఁ గుండుచుండెఁ గనుఁ గొంటే శిష్యచూడామణీ.

---

తమూర్ధజ పాకసారము, ప్వారిగఁ జూచిదానిత్రితవర్ణ నరదీనపూరమానఁద, ద్భారతవైఖరింరెగడెఁ దక్కినభాగము లన్నిపూర్తిగాఁ, గూరిచివేగమంపుఁడిది గోరెదఁ దిర్పతి వేంకటేశ్వరా.1 8-11-12, సోమవారం, గుంటుపల్లి, గోపాలకృష్ణయ్య.

---

ది 4-8-12 సర్॥ కాకరపర్రు.

అయ్యా!!

తమరు చేసినగీరతము చాలాబాగావున్నదనిన్ని, మిక్కిలి రసవంతముగా వున్నదనిన్ని, మీవాక్కు అనేనరస్వతికి ఈగ్రంథము ముఖ్యస్థానమనిన్ని వింటిని.

చర్ల సూర్యనారాయణశాస్త్రులు.

ది 30-8-12 యింజరం.

...... త్రితపద నీతిదాయకంబగుచు నరస పద భూయిష్ఠంబగు మీగీరతమున మొదటిభాగమును జూచితిని అందు మీరు మీశిష్యులను మందలించి నయమార్గంబు లంగఱపుటకై ప్రయత్నించినయంశములు పెక్కు లున్నవి. కొమరుం డెన్నియ కృత్యము లొనరించినను జనకుండవియన్నియు సహించి యూరకుండు నటుల మీశిష్యులు మీపై యెన్నివ్రాతలు వ్రాసినను మీయశస్సునకు భంగము కలుగ నేరదు. యిదియంతయు దెలియునటుల గీరతము భారతమంత గ్రంథముగా వ్రాయుచుండిరి. యియ్యది జూడంజూడ పిచ్చుకపై బ్రహ్మాస్త్ర ప్రయోగమువలె గనపట్టుచున్నది. యెవ్వరి శక్తిసామర్థ్యంబు లెట్టివియో సుధీవరు లెఱింగిన విషయమే? మీకు దెల్పునంతటి సమర్థుండను గాకపోయినను గీరతంబింతతో విరమింప బ్రార్థించు నన్ను మన్నింతురుగాక. గీరతం పూర్తిఅయిన వెంటనే ఒకటి నాకు వి, పి. గా బంపబ్రార్థించుచున్నాఁడను

పాలగ్రిమచింతామణిశాస్త్రులు.

ఉ॥ శాంకరవర్తి లేఖలనుగాంచి సహస్త్ర మేదిలేమి వా
ర్నాకు సమీప బంధు లనినన్ జగమెప్పెడి నంచు నెంచియా
సాంతము దూరదేశగత సజ్జనులన్ గికురింప నెంచెదే?
యీకపటంబు కృష్ణకవిదే యగునో? మఱి నీదికాదో? సుతా.        ౨౧౦

---

(1)...ఇకాకాలమహిమ కనుకూలముగ తమచే వక్కాణింపబడి భారతముకు బదులుగవర్తించు గీరతమునే చదువవలయునను పెక్కండ్రు చదువర్లు నొక్కివక్కాణింపు వాక్యంబులను విని నేనువ్రాసుకునే మనవియేమనగా...గీరతము 1 ప్రతిన్ని...ఈ నాల్గుప్రతులు వీ. పీ. గా పంపవలయునని నిత్యము నమస్కరించుచున్నాను.

(2)...అయ్యా తమరు రచించిన గీరతము, శ్రవణానందము, తమ కరుణవలన యిప్పటికి 2 పుస్తకములు ఆసాంతము చదివితిని శ్రవణానందము జారులపాలిటి ఫిరంగివలెనే నిత్యానందము నొసగుచున్నది. గీరతామ్నాయము కడవరకు చదివినాను. యియ్యది. కలియుగ భారతమనుటకు యేమిన్నీ సందియము లేదాయెను. కుంతికుమారుల పైకొనిన దుర్యోధనుని మాదిరి తమపై రామకృష్ణకవుల ప్రల్లదములు గాన్పించుచున్నవి గాని వేరొండు కాదు. అయ్యా మీగీరతమునందు రామకృష్ణుల ప్రసంగదమనము లేకాని కొప్పరపువారివిషయములు లేవు, యీవిషయమై జరిగిన ప్రబంధమేదియైన నున్నచో వీ. పీ గా దయచేయుదురని నానమస్కారపుమనవి.

పేరేచర్ల హనుమంతరాజు వ్రాలు. ది6-9-1913
కాకాని, సంతమాగులూరు పోస్టు
నర్సారావుపేట తాలూకా, గుంటూరుజిల్లా.

---

ది13-9-10

గొల్లకోట భైరవశాస్త్రి అనేక నమస్కారములు ...యీమధ్య తమరు అచ్చువేయించిన వాదపత్రిక నాకు వినతమందు చాలాకుతూహలముగా నున్నది. పిఠాపురములో తమ పత్రికను చూచినవారు చాలా సంతోషించుచున్నారు... ...యీపత్రికయున్న పంపించితే దానిఖరీదులు దాఖలుచేస్తున్నాను.

ఇట్లు విధేయుడు గొ॥ భై॥ శాస్త్రి.

శా॥ నీమేనత్త కొమారుఁడే తెలిసె వానింగూడ నా బందు వం
చేమేనిఁ లిఖియింప నేరుతువె మీ కృష్ణుండు నీతండునుఁ
సామాన్యంబుగ సన్నుదమ్ములనుతుల్ సత్యంబు నందొక్కఁ డు
ద్దాముం డింకొకఁడో? యసత్యమున విద్వాంసుండు శిష్యాగ్రణీ. ౨౧౧

---

......ఉ॥ వింటిని గీరతమ్మనుచు వేదమెయానని ధర్మబోధయం, దుంటిని వచ్చు చెప్తాయని ఔరా గురుశేఖర! గీరతమ్మ నే, డంటిని వేదమే యనుచు నాగ నిరాకరవిల్ కవీంద్ర! వా, కొంటిని వీ. పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ములన్.

ఇట్లు శిష్టామనుమల్ శాస్త్రులవారి శిష్యుఁడు
మంత్రాల కామేశ్వరరావు.

---

......శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభి ర్విఖ్యాతలీలాపాత్మకో, యుష్మద్గ్రంథవిదూషణాత్మకతయా గ్రంథస్తు రౌరా నిర్మితః, దృష్ట్వాతం బహుధావినిశ్చితధియా మస్మిన్ స్వజానాంవచ శృత్వా కించిదపి, ప్రవక్తుమలనన్త ద్గీరతాదర్శనాత్॥
శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోర్ఝరీంతాం, నధాను విస్తారయితుం మనోమే, నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు, తమవిధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి.
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, యెర్రగొండపాలెం.

---

శ్రీ...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దాని శైలియిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు...చెప్పట్లపర్వములో మా సూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు, అది అన్యాయమని నేను దలచుచుంటిని అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు కాకపోడు, వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున. విశేషమైన భక్తికలవారైనను, మాతెత్తండ్రిగారి అబ్బాయి యింటివల భక్తిలేనివాడుగా మీకు కనపించుచున్నాడు. అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదుగాని నిజానికి అంతరంగము నందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తికలవా

ఉ॥ వేదుల రామకృష్ణునకు వేదులవారును జర్లకున్ స్వదా
యాదులునున్ విరుద్ధులయి యగ్నికగీనత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టి శా దది ప్రమాదములోఁ బడు వాఁబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట నుమ్మి పుత్రకా. ౨౧౨

చ॥ ఒకఁ డెవఁడో వివేకవిరహుం డుపయించిన సంతమాత్రి స
త్ప్రికరపరఁ పరా జనిపదంబులు వంశము.ల ప్రతిష్ఠ చేఁ
గకవిక గాంచఁ బోవనుచు గట్టిగ చాటుట మన్న మాట వా
రకుటిల చిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతన్. ౨౧౩

---

దేఅని నేనే కాక మాగ్రామమంతా కూడా యెరిగిన సంగతియే, మా సూర్యనారాయణశాస్త్రిగారు మీవిషయమై యెవ్వడుగాని, యేవిధమైన చెడుప్రసంగము చేసిన వాడు కాడు. యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజంచెప్పేవాడే కాని వేరు మోస్తరువాడు కాడు, యితడే కాదు వాళ్లు వ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పదునని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మారామకృష్ణమ్మ మాట అటుండగా, ఆ వ్యాసమూర్తి శాస్త్రులు గారి తమ్ముడువల్లనే అనిమాగ్రామంలో చెప్పనివారు వకర్రురువుండరు. యిట్టిస్థితిలో మా సూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట ఆతనికిన్నీ నాకున్నూ చాలావిచారము గానున్నది. యీసంగతి అత డు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పుకూతలు అయి నప్పటికిన్నీ అతను అచ్చునకు తీసుకొనివెళ్లుట, అనాలోచన పనిగా తమరు నమ్మవలెను, ఇటీవలఅవధానములలో తమరినిగురుస్తుతిగా నుతించినాడు. ఆపద్యము నాతోచాలాసార్లు వినమని చెప్పినాడు. ఆపద్యములు ముందు అచ్చులో నున్నవి. మాడగలరు, ఆరెండవనాటి అల్లరినభలో కాకరపర్తి వెంకటశాస్త్రి యున్నూ; నారాయణ శాస్త్రిగారున్నూ, వీరికి సంబంధించినవారున్నూ కాక మిగతా వారియుద్దేశం కలవారు కారు. మీరుమాత్రం అప్పుడు అంతాదురుద్దేశం కలవారనే అని అనుకొనియుందురు, యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మాకాయర్థము స్పష్టపడుచున్నది. మాసూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవ డు కాడు, యితడు మీగీరతంరాకనై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు, వచ్చినతరు

శా॥ నీమేనత్త కొమారుఁడే తెలిపె వానింగూడ నా బంధువం
జేమేనిన్ లిఖియింప నేరుతువె మీకృష్ణుండు నీతంతునన్
సామాన్యంబుగ నన్నదమ్ములనుచున్ సత్యంబు నందొకఁడు
ద్దామం డింకొకఁడో? యసత్యమున విద్వాంసుండు శిష్యాగ్రణీ. ౨౧౧

---

......ఉ॥ వింటిని గీరతమ్ము మును వేదమయానని ధర్మబోధయం, దుంటిని వచ్చుటెట్టాయని రామా గురుశేఖర! గీరతమ్ము నే, డంటిని వేదమే యనుచు నాగ నిరాకరనవిత్ కవీంద్ర! వా, కొంటిని వీ. పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ములన్.

ఇట్లు శిష్టావానుమల్ శాస్త్రిలవారి శిష్యుఁడు
మంత్రాల కామేశ్వరరావు.

---

......శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభి ర్విఖ్యాతశీలాపాత్మకో, యుష్మద్గ్రంథవిదూషణాత్మకతయాగ్రంథస్తు రామా నిర్మితః,దృష్ట్వాతం బహుధావినిశ్చితధియా మస్మిన్ప్రజానాంచ శ్రుత్వా కించిదపి, ప్రశస్తుమలనస్తద్గీరతాదర్శనాత్॥
శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోధురీంతాం, సభాసురి స్తారయితుం మనోమే,నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు,తమవిధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి.
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, యెర్రగొండపాలెం.

---

శ్రీ...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దాని శైలియిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు...చెప్పట్లపర్వములో మా సూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు, అది అన్యాయమని నేను తలచుచుంటిని అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు కాకపోడు, వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున. విశేషమైన భక్తికలవారైనను, మా పెత్తండ్రిగారి అబ్బాయి యింటివల భక్తిలేనివాడుగా మీకు కనపించుచున్నాడు. అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదుగాని నిజానికి అంతరంగము నందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తికలవా

ఉ॥ వేదుల రామకృష్ణునకు వేదులవారును జర్లకుఀ స్వదా
యాదులునుఀ విరుద్ధులయి యగ్భకగీసత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టి కాదది ప్రమాదములోఁ బడు వాఁడెబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట సుమ్మి పుత్రకా. ౨౧౨

చ॥ ఒకఁ డెవఁడో వివేకవిరహుం డుదయించిన నంతమాత్ర స
త్ప్రకరవరఁ పగా జనివదాంబులు వంశము.ల ప్రతిష్ఠ చేఁ
గకవిక గాంచఁ బోవనుచు గట్టిగ చాటుట కున్న మాట వా
రకుటిల చిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతకా. ౨౧౩

---

డేఅని నేనే కాక మాగ్రామమంతా కూడా యెరిగిన సఁగతియే, మాసూర్యనారాయణశాస్త్రికూా మీవిషయమై యెప్పుడుగాని, యేవిధమైన చెడుప్రసంగము చేసినవాడుకాడు. యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజంచెప్పేవాడే కాని వేరు మాస్తరువాడుకాడు, యితడేకాదు వాళ్లువ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పదువని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మారామకృష్ణమ్మ మాట అటుండగా, శ్రీవ్యాసమూర్తి శాస్త్రులు గారి తమ్ముడువల్లనే అనిమాగ్రామంలో చెప్పనివారు వకర్రూరువుండరు. యిట్టిస్థితిలో మాసూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట అతనికిన్నీ నాకున్నూ చాలావిచారముగానున్నది. యీసంగతి అతడు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పాకూతలు అయినప్పటికిన్నీ అతడు అచ్చునకు తీసుకొనివెళ్లుట, అనాలోచన పనిగా తమకు నమ్మవలెను, ఇటీవలఅవధానములలో తమరినిగురుస్తుతిగా నుతించినాడు. ఆపద్యము నాతోచాలాసార్లు వినమని చెప్పినాడు. ఆపద్యములు ముందు అచ్చులో నున్నవి. చూడగలరు, ఆరెండవనాటి అల్లరిసభలో కాకరపర్తి వెంకటశాస్త్రియున్నూ; నారాయణ శాస్త్రిగారున్నూ, వీరికి సంబంధించినవారున్నూ కాక మిగతా వారీయుద్దేశం కలవారు కారు. మీరుమాత్రం అప్పుడు అంతాదురుద్దేశం కలవారనే అని అనుకొనియుందురు, యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మాకార్యము స్పష్టమవుచున్నది. మాసూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవ డుకాడు, యితడు మీగీరతంరాకపై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు, వచ్చినతరు

చ॥ ఎఱుఁగని వారి కన్నులను నేఁడిది నీవు మూరక చల్లవచ్చు ద
గ్గఱఁగల బంధుజాలము మొగంబులు మూయఁగ నేర వూరకే
వఱుగిడ కిప్పుడేనియు నెవా సనిపించు కొనంగ యత్నముల్
బొరయుము కృష్ణసత్కవికి బుద్ధిని జెప్పి మరల్పు మర్భకా. ౨౧౪

చ॥ సకల మెఱింగి నా కవయశం బొడఁగూర్పఁగ నెంచి వెళ్లి యు
త్ప్రకటనముల్ పొరింబొరిగఁ బత్రిక నించెదె? కొండ వీటి వా
రికి మఱి వానటయ్యెడ యరిపత్రికరంబు లిఖించు మర్వద?
ప్రకరము పొత్తముం గొని ప్రల్లదముల్ లిఖియింతువే సుతా. ౨౧౫

---

వ్రాత మిక్కిలిగా సంతోషించిన భాష్యకారశాస్త్రి వస్త్రైరాలతో పాటితని సుక్కనిగా భావించుచు రెండవకూర్పులో యితనిని సవరించెదరని నమ్ముదును.... ...మరుదినమందు పశ్చాత్తాపపడని వారే లేరు, ఒకనాడు మా రామచంద్ర పెదనాయనగారు, మారామకృష్ణమ్మను చీవాట్లు వేయగా నేను విన్నాను. యెవళ్లు యెంత దాచుకున్నా సంగతులు తెలియక పోవు. కోకిలకాకములో 'కావు, కావు, కావు, కావు, అను కల్పనయె యిప్పటికిని మీ కవిత్వమందు వాళ్లకు భక్తికలదని చెప్పుచు నేయుండును. సీ॥ ఇవి రాజసుతులు చేయతలనీన పనులు కావు కావంచు గాకమ్ములఱచె,, అను బుద్ధచరిత్ర సీసపద్యమును జూచిన వారికి విస్పష్టమే, లోకములో సత్యమును గ్రహించే వారు పలువురు వున్నా అనృతపు వ్రాతలు వ్రాసేవారు వ్రాయక మానరు. వేములవరంలో తమకు జరిగిన సన్మానమునుతమరు అక్కడ జూపిన అసాధారణశక్తియు ఒక విద్యార్థి అక్కడ స్వయంగా చూచి వచ్చి మావూరిలో నాకు చెప్పినాడు, శ్రీ సీతారామశాస్త్రి మరియు మొదలైన వార్లు చాలాసంతోషించినారు. విచారించే మాటములో వారుగూడా కొంతమంది నాదగ్గర సంతోషించినారు. యిటీవల నేను యేలూరువస్తిని అక్కడ ఆంధ్రపత్రికలో కామేశ్వరకవి వ్రాతచూస్తిని, రవాణితమున్నా నేనువిన్నదానికి సంబంధములేదు. ఆ వ్రాతలు ప్రకటించిన పత్రికాధిపతి తెల్వితేటలను గూర్చి నాకు చాలా విచారకరమైయున్నది. ఎప్పుడున్నా దుర్మార్గులు చెడుపనులు చేస్తూనే వుంటారనట్లుందులకు, ఆ వ్రాత దృష్టాంతముగా యున్నది. యీ వార్తల నిజము మావాడు మెరిగి వుండికూడా యేదో పేరుపెట్టి ప్రకటిస్తూయుంటారు, యిట్టి వ్రాతలవలన గాని వద్దకోతల వలన గాని మీకీర్తికి యీసుమంతయు లోపము రాదు,...

ఉ॥ పుట్టిన దుత్తమాన్వయము పోయి వసించినచోటు ధర్మపుం
బట్టము పీఠికాపురము, పార్థివుఁడో యలధర్మరాజె నీ
కిట్టిదురూహ పుట్టుటకు హేతువు గానఁగలేక సారెకుం
గట్టితి నిన్ను తద్దయు నఖండయశమ్మును నీకొసంగితిన్. ౨౧౬

ఉ॥ ఎంతటివాఁడొకో శిష్యుఁడతఁడెంతటివాఁడను గాఁడయేని దు
ర్దాంతుఁడు వేంకటేశ్వరుఁడు "తమ్ముఁ దలంతుఁ" దటంచు విఁతగాఁ
జింత వహించునేని మఱియుఁ జెప్పనె భారతమంత గ్రంథ"మం
చెంతురు లోకు లెట్లయిన నేమి కృతార్థుఁడ వైతి తర్భకా. ౨౧౭

ఉ॥ ఎందఱు శిష్యులో కదు సహిష్ణునిగా ననుఁ గొల్చుచుండ నీ
యందునె పట్టు పట్టు టది యారయ నీదు పురాకృతంపు భా
గ్యంబిర కాక యిందునుక హేతువు గల్గునె? ధన్యమూర్తి వీ
వందఱు శిష్యులందునను నర్భక! నందియ మిందు లేదు సూ ౨౧౮

...బ్రహ్మానందశాస్త్రి వ్రాసినట్టుగా మాగ్రామములో కొంతమంది కోతిమూక యున్నది ...పుంగవుల కొఱకు గుంటూరులో మూడుమాసములు వసించిన మీరు మాగ్రామములో రెండురోజులైనను వసించినయెడల మీవైరులెంతగంభీరులో తెలియకపోవునా, దర్లదలపతి వ్రాసిన కృతూర్పణ యుత్తరంవల్లనే తమకు గోచరించి యుండవచ్చును....పిడుగువంటిది దిరువతిశాస్త్రిగారి యుత్తరం వచ్చినతోడనే అతనికేకాదు ఆపక్షములో పెద్దతలకాయలకును గుండెజలజలనించె...మీథాటికి వారెవరు, వీరెందులోవారు. మహాగజాశ్వతలాయంతే మశకానాంతుకాకథా, యిదిపిచ్చుకపై బ్రహ్మాయుధ మున్నట్లున్నది, అయిన యిది ఒకమిషచేసికొని మీరు మావోట్లందరికి గురుశిష్య ధర్మాలను. ఉపదేశించుటచే లోకోపకారమని చాలామంది పెద్దలెల్లరు సుదుతగా సేసుకున్నారు. మీగిరతమును జూచి నారాయణశాస్త్రిగారు సూర్యనారాయణశాస్త్రితో నిన్ను కారకునిగా వ్రాసినారు. గాని యింతచేసిన మమ్ము దేమియు మాపత్రికాత వ్రాయనే లేదుగదా, బాగుగానున్నదే అని పకనాడు అనుకున్నాడు,...రెండవ కూర్పులో సూర్యనారాయణశాస్త్రిని తప్పక నిరపరాధినిగా సవరణచేస్తారని నానమ్మకము, యిదియే అనేక నమస్కారములు. సామవేద్ల సూర్యనారాయణావధానులు వ్రాలు.

సాకిన్ కాకరపర్రు

ఉ॥ "శృంగపు భంగముల్" గని యన్నీ? యని కొందఱు రాజ పూజ్య శ్రీ
వెంగలి వ్రాఁత వ్రాసిన ప్రవీణుల ప్రజ్ఞను సత్సభా ముఖా
శృంగమునందుఁ జూత మని జాబును మీకు లిఖింప నెంచి స
న్మానం గని వల్కు వారల ననుంగుల నేను మరల్పితిం జుమీ. ౨౧౯

## (9) సంకీర్ణ పర్వము.

ఉ॥ *పావమున్? వా రెఱుంగుదు రె పాండితి నీయది, వత్తు వంచు ని
న్నోవికఁ బిల్వ నెంచి రెటులో పికరి? యీ వాకసాకు వన్నె యా
భూపులఁ జిన్నఁబుచ్చె దపు పొచ్చెము వన్నెట కీర్తి నేరవే,
దాపున దాప లేఁడె యిది తజ్ఞులు దక్కు జగం బెఱుంగునే. ౨౨౦

క్షేమము, ఆశీర్వచనములు.

మీరు మావూరు వచ్చినప్పుడు ఇంకా వుంటారుకదా అనుకొన్నాము. వెంటనే వెళ్లిపోయినారు. మీరు యెంతగొప్పవారయినను బంధువులను అనాదరించడము న్యాయముకాదు మావూళ్లో యెవళ్లో అల్లరిజేసినారని మేమంతా దానిలో వాళ్లమే అని వూహించి మామీద శితకన్నేయుట ధర్మముకాదు. రామకిష్టమ్మ వ్రాసిన తప్పదువ్రాతకు మావూళ్లో పెద్దలెవ్వరూ వార్షించడములేదు. రామకిష్టమ్మ తండ్రిగారు కూడా కొడుకుచేసినతప్పునకు చాలా నొచ్చుకోవడము నేనువినియున్నాను. తండ్రే నొచ్చుకొనప్పుడు యితరులు నొచ్చుకొంటారని మీరాలోచించడము తప్పు, అనిమళ్ల సీతారామశాస్త్రిలు వగైరాలు మీరు వెళ్లినతరువాత రామకిష్టమ్మ వగైరాలను చాలామందలించినారు. గ్రామానికి అప్రతిష్టతెచ్చేపనులు పెద్దలెవ్వరూ సమ్మతించరు. నేనుచదువకపోయినా మీకుమీకు వుండె తేడాపాడాలు యెరుగనివాడనుకాను. తాతపూడి భానప్పవ్రాలు.

* వుత్తరం...శ్రీ శ్రీ... లు... చిత్తగించినారు, యింతమాత్రముచేతను వారి మనస్సుకు తృప్తిగాలేదు,... సభచేయించి తగుపండితులను ఆహ్వానంచేసెదము సన్నిధియందుయున్న శ్రీలకు వప్లీకు వుత్తరములు వ్రాయించెదమనిన్నీ యీవుత్తరం అందినతోడనే ఒకరోజుశలవ్వపుచ్చుకొని రావలశినదిగా శెలవియిచ్చినట్లుగున విజ్ఞాపించెదను. ది 11—8—11 (చేవ్రాలు)

ఉ॥ కోయిలయెల్లకాల మొకకోటరమందె వసింప దొక్కొ పెం
తీయని మావిగున్నపై గతిం దలపోయదు మావిగున్నలం
దేయెడ సంచరించు టది యెవ్వ రెఱుంగరె? యొక్కసారి పైఁ,
బోయి. స్వశక్తిపద్ధతులు పొంపిరివో విహరింపు మర్భకా ౨౨౧

ఉ॥ కాకులబాధ బాల్యమునఁ గాని యనంతరమందు నుండ దీ
పాకము నీ వెఱుంగవొకొ? ప్రౌఢత గల్గిన కోకిలంబుతో
డీకొన వెందుఁ గాకములు డేకకు మూలల, నత్సభాస్థలిన్
బ్రాకటశక్తిఁ జూపుము ప్రపంచక మెల్ల నిజం బెఱింగెడిన్. ౨౨౨

ఉ॥ అల్లెడు పద్దెముల్, సరిగ నయ్యవి యుండెడి, వందియంబు లే
దల్లెడినంతనే జగము లల్లన మెచ్చునె? యెన్నిశక్తులో
కల్లవితంబులైనయెడఁ బ్రాజ్ఞులు మెచ్చెద రప్పుగూడఁ గీ
ర్త్యుల్లసనంబు దుర్లభము రూపికకే? రౌపికనెంచి చూడుమా? ౨౨౩

ఉ॥ నిద్దుర పోవుమోము, గణనీయము గాని గళంబు, మేటియౌ
పద్దెపు తెల్విధార, విన వాంఛ జనింపనివాక్కు, గాక యే
విద్దియ గాని నేర్చినవివేకులు సత్సభలో నివారలన్
దద్దయు మెచ్చఁ జేతు రని దజ్ఞులు దెల్పుదు రీ వెఱుంగవే. ౨౨౪

ఉ॥ పెద్దలు వచ్చునప్పుడది బిట్టుగ విస్మృత మాశరీరమున్
గద్దఱిమూఁకఁ జూచునెడఁ గంకెదు పెంకెతనమ్ము వాక్కులం
బెద్దఱికంబుఁ బ్రౌఢిమయుఁ బెక్కుగుణమ్ములు పొల్చు జాణయే
తద్దఁ బ్రపంచవున్నతికిఁ దాఁ దగు నన్యు లనర్హులే సుమీ. ౨౨౫

ఉ॥ పెంకెకుఁ బెంకె పెద్దకును బెద్దగ నెవ్వఁడు సంచరించునో
లంకకు వాఁడు పోయినను లక్ష్యము లేక జయించి వచ్చు ని
శ్శంకుని నాంజనేయు నిట సాక్షిగఁ గైకొను మాతఁ డెంతయో
పెంకె సురారికోటి యెడఁ, బృథ్వితనూజ యెడన్ వినమ్రుఁడే. ౨౨౬

ఉ॥ ఈ వచియించులక్షణము లిన్నియుఁ గల్గినవార లెందఱో
భావలయమ్మునం దొకటఁ బొల్పువహింప రొకండొ యిద్దఱో
చూవె తెలియంగ లేర, లివి చెప్పెదఁ జూ శివరామునం దెటో
దైవవశమ్మునన్ బృథగఁ దజ్ఞుని వానిని దూఱు టొప్పునే. ౨౨౭

రాఁడనుకోకు రాఁగలఁడు రమ్మన వచ్చెదవేని దానికిన్
గాఁడు పరాఙ్ముఖుండు సరిగా లిఖియింపుము జాబు దీనికిన్. ౨౩౨

ఉ॥ * కాఁకర పర్తిరమ్మనెదొ? కాఁకర పర్తికె వచ్చు "శృంగభం
గాకలనంబు సల్పఁగల యయ్యలు తోడుగ నీవు బావయున్
దాఁకఁగ నేర్తురే యతని; నాలుక వచ్చినయట్టులెల్ల నె
ట్లో కలహమ్ము సల్పెదరె యోగ్యులు లేరె నిజమ్ము తెల్పఁగన్. ౨౩౩

ఉ॥ మానుఁడు వ్రాఁత లింక, నవమానపు వ్రాఁతలు వ్రాయ దొంగదు
ర్మానుల నెల్లఁ బట్టుకొని రాఁ దగుశక్తిని దేవుఁ డిచ్చెఁ జూ?
సూనృత మూఁగ శక్యమె సుషుప్తిని లోకము సర్వదా కలిన్
బూనదు మేల్కొనున్ నిజము పూర్తిగఁ దా నెఱుఁగుం గ్రమమ్ముగన్. ౨౩౪

ఆ॥వె॥ శ్రీపత్రికాధిపతులు బాబో? ప్రమాదమం, చన్నవ్రాఁత నూనియనృతకల్ప
నములు చేయుబావనాలుక కొకచంద్ర, హార మిత్తు నెదుటి కనుపఁగలవె.

చ॥ కల దొకకొంత తెల్వి, యది గాదని నేనన, నంతమాత్రచే
నిల సకలమ్ము మోనమున నే మునిఁగింపఁగ నెంచి యేవిరో

---

(తాలుకుట్టనమునుండి).

*చ॥ శివుఁడను లేక రాముఁడను జేసెద నోమఱి చేయలేను నా, కవనను చూడఁగాఁ దలఁపుగల్గిన జాబులిఖింపుఁ డూరకే, సువిసువిఁ గ్రుక్కుపద్దెముల నూరులునవ్యలిఖింపనేల? యే, కవిత నొ తేరగా నొకటి గల్గుటకున్ ఫలమిట్టిదౌనొకో॥ ౧॥ మ. సభకున్ రావలె నోరుతిప్పవలె మీసామర్థ్యముం జూపి వాగ్విభుతన్ గాంచవలెన్, వృథాగ నొకచక్రాన్ దాఁగి నానాఁటి రాసభముల్ గోఁకిన పాదుప్రాఁతలకు చానలస్యమ్ము గావించుచో, కు భయంబా? మఱిభక్తియా? యురకెటో ఘూషిఁలుదిచ్చాగతిన్॥ ౨॥ ఉ॥ వచ్చెద, రమ్మటన్న నృపవల్లభునాజ్ఞనుబొంది మీరలే,వచ్చిన నిఁతకన్ననుశుభంబిటు సేయుఁడు లేదయేని యే, పిచ్చినొవెళ్లఁ గ్రిక్కుండు పెద్దలు నవ్వుచునున్నవారుమీ,కుచ్చితపుంబ్రసంగములకుం జెవియొగ్గఁడు ప్రాజ్ఞుఁ డొక్కరుఁడున్(విస్తరమాగ్రంథమునందే చూడఁదగు)

*దీనింగూర్చి గుంటూరిసీమ- పూర్వరంగము, 49,50 పుటలు చూడఁదగు.

గిలుకుచుఁ *"చేటభారతము" గిరతధోరణి నద్భుతంబు వా
క్కులు ప్రచురింప నేల వినఁ గూడని పోకలు కట్టిపెట్టుఁడీ. ౨౩౬

చ॥ తిరుపతివేంకటేశ్వరుని దిట్టుచుఁ జెప్పినయట్టిపద్దెముల్
గురువరు నింద సల్పినను గొండొక చక్కఁగ నున్నదంచుఁ జె
ప్పిరి వినువారు, తిట్టినను బిప్పికవిత్వము కాదు గాన వా
విరి నవి బైటఁ బెట్టుఁడు ప్రవీణత కయ్యది సాక్ష్య మిచ్చెడిన్. ౨౩౭

ఉ॥ తిట్టిన నేమి స న్నురక దేవునిఁ జేసితి వంటివి దాన నూ
దట్టుఁడవే దేశికత్వమును దాఁటినపొల్పద మబ్బఁ జేయునా
తిట్టులు నాకు దీవనలె తిర్పతివెంకన పేరు నాకు మున్
బెట్టిన యందు కీవు నరి పెట్టితి వంచు నుతింతు నిన్నుఁ గన్. ౨౩౮

ఉ॥ ఊరక యిచ్చినన్ గొనని యప్పనిచప్పనిమాఁట లెల్ల నై
వ్వారలొ "కర్బు" లిత్తు రని వారకయిచ్చినఁ గ్రిచ్చ నేల ప
ర్వారరసప్రసారగుణ బంధుర దివ్యతరప్రబంధ సం
సారులు గందు వర్థిలుఁడు జాడ్యము మాని సుఖింపుఁ డింపుగన్ ౨౩౯

ఉ॥ బీజము లేని ప్రాఁత లవి పెంపు వహింపవు మీకు బీజ మే
రాజ ఘటిల్లునో మురక యున్న గురున్ దిగఁద్రావి తిట్టఁగా
నాజడుఁ డూరకుండక యహంకృతిఁ జూపె నటందురోటునే మీ
బీజము దెల్పినట్టులె వివేకులకున్ బోధకట్టెడిన్ జూఁడీ. ౨౪౦

మ॥ యతులున్ బ్రాసలు పెట్టి యెట్టులొ కవిత్వాడంబరం బూని తి
ట్టితిరే యందము దాన లాభ మది యొట్లోఁ గల్గఁ గాఁ బోదు వం
దితు లాధోరణి మెచ్చుకొన్న, సల గోష్ఠిన్ సత్యవాక్చాతురీ
వితతప్రజ్ఞత చూపకున్న వితయా వేయేల! చాలింపుఁడీ. ౨౪౧

సీ॥ వెః రాజ్ఞబండి శతవధాని వ్రాసినట్టి, పద్యముల సారమును మదిఁ బట్టుకొల్పి
శ్రోతలకున్ రందు దేశకద్రోహచింత, వలనిదోసంబు నమశాపభరము మిగ్రింగు.

---

*...మనపిఠాపురపు వారు "చేటభారత" మొకటి వ్రాయుచున్నారట!...

6—2—19 సుందరరావు

ఈ దినిం గూర్చి గుంటూరిసీమ, పూర్వరంగము 138, 129, 140. పుటలు చూడఁదగు.

తే॥ గీ॥ ఏమిసార్థక్య మోదిరా యూరు వ్రాసి, వెంటనే యేను ఖండించి వేసినంత
సత్యమో జయమ్మనిచ్చు యశమ్మునిచ్చు, సత్యమునఁబొమ్ము మంచియశమ్ము గొమ్ము

ఉ॥ వెంకటశాస్త్రి నేరె యవివేకులు తిట్టి రటంచుఁ గాని యే
కుంకరొ యు సత్ప్రశాస్త్రలిని గొట్టె నటంచును గాని యెవ్వఁడో
జంకక వ్రాయ నయ్యది యసత్య మటంచుఁ దలంతురంటయే
వంకయు, నమ్మచో ముద మపారము గాంచుట చెప్ప నేటికిన్. ౨౪౪

తే॥ గీ॥ శత్రునకు నేని యావన్నైనఁ దారు, పైని నంతనతఁడు మెంత పాతకంబు
వరము తర్కులు గిలికెడి పాడు వ్రాఁత, లౌర! పుస్తక మంచు వ్రాయంగఁ జనునె

తే॥ గీ॥ అంతమోయింతయో యక్షరాస్యులైన, మీకుఁ బారమ్మ లేని నామీఁద నక్ష
రములె నేరని వారేమి రాఁ దలంతు, రింత మాత్రము తెలియవిఁ కేమనందు.

క॥ మిషఁ బట్టి కొవ్వరము కొ, ప్రమఁ బట్టియు మీరు తప్పవ్రాఁతలు గిలుకన్
శ్రమ మొకటిదక్క వెంకన, కమరునొకో యప్రతిష్ఠ యరయఁ డిఁకైనన్.

క॥ *బ్రహ్మత్వమునతోడన్, బ్రహ్మాండం బగుకీర్తి ప్రబలించెడిరా
జిష్ణుగురూ! మీ "యం, బ్రహ్మతకు విచారమేల పడవలెనకటా!. ౨౪౮

శా॥ మీయజ్ఞానము గొప్పరుం దెలిపియున్ మొల్గార్చెడి న్నాకు మీ
రాయాసం బడకుం డసత్యములు వ్రాయంగాఁ బ్రయత్నించకుం
డో యాశువ్యఁడ! "వేఁడిసీళ్లకు గృహం బొక్కింతయున్ గాల" దా
హా! యజ్ఞానపుటట్టహాసములకున్ వ్యాహారపారీణతల్. ౨౪౯

ఆ॥ వె॥ అట్టహాసమంటి! అద్దాని నిండఁ ద, ప్పదుు ప్రసంగమంటి! పుడమి తోఁడు
చూచియుండఁడో! కొక్కి! చూచియువారింతఁ, డొక్కొ! చూడఁడను టెమొప్పవలయు.

ఉ॥ చూచిన సూరకుం డఁ "డిదె కుంతప్రసంగము మానుఁ" డంచు వి
ప్రోచిత చిహ్నములన్ గొలువ మెల్లను మానఁడ ప్రాజ్ఞుఁడై యెటుల్
నీచత నమ్మింతు నసనీవతి నిక్కము చూచియుండఁ డీ
లోఁచియుఁ దోఁచ రానిమతిత్రోవలు పోనికిఁ జూడ నేటికిన్. ౨౫౧

---

*దీనింగూర్చి వేదవరాగ్రహార శతావధానమునఁ జూడఁదగు.

చ॥ ఎవరు చివాట్లు పెట్టఁ బని యేమి? గురుండను నేనె చాలు, దు
ర్వ్యవహృతి పూర్తిగా నెఱుఁగు పండితమండలి చాలు, బుద్ధి చె
ప్పవలసి వచ్చినన్ గురుఁడుఁ బండితవర్గము, వీరిపైని బా
ధ్యపుఁడు వచింపఁగా వలయుఁ దేఁకువ గల్గిన వీర చాలరే ౨౫౨

ఉ॥ తప్పుడు వ్రాఁతలందును "శతఘ్నిని" వ్రాసెదునంతదాఁక వ్రా
లొప్పుగఁ జేసి తీవి పుడో యొక్కఁడె బావయ చేయుచుండె నీ
కిప్పుడు బుద్ధివచ్చినదియే వచియింపు "శతఘ్ని" యూరకే
"ట"వ్వని వ్రేలి పాశుపత ధాంకృతి కుప్పను గాక ప్రస్ఫుటన్ ౨౫౩

ఉ॥ నీ కటు బుద్ధివచ్చుటయె విక్రమయేని వచింపు మింకఁ బె
న్వ్రేఁకఁ జరించు బావకు వివేకము గూర్ప యతింతుఁగాక యా
శాఁకరవర్తి వానికి నఖండమృషావచనప్రతాపికిన్
ప్రాకటధర్మముల్ పలుకు పద్ధతి వేఱనుమా? కుమారకా. ౨౫౪

ఆ॥వె॥ అకట! పాశుపతము నడఁపఁ బరాస్త్ర, పాశుపతమనుచు నుష్ట్ర "శాంతికాయ"
వ్రాఁత వ్రాయు బావ వైఖరిగనియు నీ, వేలయూరకుంటి వెలుఁగఁ జెప్పుము.

క॥ అందుఁగల యమృతఘోరణి, "సందేహము లేదు బావ శాబ్దికజీవా
నందుని" పారము తేల్చెడి, నెందుల కా పిచ్చివ్రాఁత లెఱిఁగింపు సుతా. ౨౫౫

శా॥ ఏదో వ్రాసెడివాని పోల్కి నెదిరూ యుంచింత పవంగఁ బై
నేదో వచ్చుఁగదా? యటంచు నకటా! కృష్ణాఖ్య వస్త్రంబు గై
కో దూఁకెన్ బయి సిగ్గిలెన్ జుమి వృథాకుంఠితవ చ్ఛౌర్యశ్రీ
ఖాదార్భాగ్య వచఃప్రచార కలనా గర్వాంధ్య మిట్లుంచునే ౨౫౬

ఆ॥ వె॥ వ్రాఁతయట్లులుంచు పాశుపతమ్ముపైఁ, బాణపేరుపేరుఁ బట్టుపడెనె
అంచు బావతోడ వాదుమీ నాకునై, గురుని కింత సలుపు చరణసేవ.

క॥ * బావవచనములు వినకుము, భావవచనములను వినుము బాగుపడుము సం
భావించి భృగుఁడు చెప్పిన, బావుకవచనములు భావవచనములనఁగన్. ౨౫౭

---

* స్కాందోత్తర ఖండస్థగురుగీతనుండి.

శ్లో॥ అత్రినేత్రశ్శివస్సాక్షా ద్ద్విబాహుశ్చ హరిస్స్వయం, అచతుర్వదనో బ్రహ్మా శ్రీగురుః కథితః ప్రియే ... శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మావిష్ణుమహే

గీ॥ అల్లకృష్ణుండు సంధికినంకనీక, పార్థుల నపార్థుల నొనర్చె బావమఱఁది
యంచుఁ గృష్ణునిబోధల, వాలకించి, తాదృశుఁడ వీవు కాఁడు వృథాభిధముగ.

ఉ॥ అన్యులతోడ మాకు నెవుడైనను వేరొక కారణమ్మునన్
జన్యము సంభవించునెడ సాయము వారల కాచరించి నీ
వు నృశంసుఁ గలంచుటకు బుద్ధిని ద్రిప్పితి వెంత వెఱ్ఱివో?
ధన్యత లేనివారలను ధన్యులఁ జేయఁగ నీకు శక్యమే. ౨౬౧

మ॥ ఒకచో గుంటురి కీవు పోవనుకొ పెన్మాత్ర వెఱ్ఱిత్వమ్యుండని శా
ఖకునై వారలు నిన్ను నిష్టగతిగాఁ గారించ యత్నింతు? నీ
కకటా! దిక్కెవుడున్నె? నాకొ? మఱి నీవా? కాదు, నీవంటి వా
రొక వేయైనను లెక్కలేదు సుమి రోగ్యుల్ పండితుల్ స్నేహితుల్, ౨౬౨

ఉ॥ వారలె లేకయున్నయెడ వాండ్రును నీవును గూడి దబ్బఱల్
సారెకు వ్రాసి యెట్లయిన సాయముపట్టక పోరవత్సరపున్

---

శ్వరాః, సామర్థ్యమగమన్ సర్వే కేవలంగురుసేవయా,... శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం, శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥... శ్లో॥ ...గురునిందాంకరోతియః, సయాతినరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥ ...శ్లో॥ "హుం" కారేణ నవక్తవ్యః ప్రాజ్ఞైశ్శిష్యైకదాచన. గురోరగ్రే నవక్తవ్యమసత్యంతు కదాచన, గురుం త్వం కృత్య హుం కృత్య ...నభవేద్బ్రహ్మరాక్షసః॥...శ్లో॥ ...కాలమృత్యుభయాద్వాపిగురుస్సంత్రాతిపార్వతి। ... శ్లో॥ గురుదేవార్చనం యస్తు తేనతుష్టా స్త్రిమూర్తయః॥... ...శ్లో॥ గురోః పరతరం నాఽస్తి త్రివారం కథయామి తే॥ ధన్యామాతా పితా ధన్యో గోత్రంధన్యంకులంభవం, ధన్యాచవసుధాదేవి యత్రస్యాద్గురుభక్తతా, ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః, తాస్సర్వాస్సఫలా దేవి గురుసంతోషమాత్రతః,,...శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యోగురుంనైవమన్యతే, శ్వానయోని శతంగత్వా, చండాలేష్వభిజాయతే॥ ...శ్లో॥ సప్తకోటిమహామంత్రా శ్చిత్తవిభ్రమకారకాః, ఏకఏవపరో మంత్రో గురురిత్యక్షరద్వయమ్...శ్లో॥ ... కవిత్వాదిగద్యం సుపద్యం కరోతి, గురోరంఘ్రిపద్మే మనశ్చే న్నలగ్నం తతఃకిం తతః కిం తతఃకిం తతః కిమ్ (విస్తరస్తుతత్రైవ ద్రష్టవ్యః).

భారము మోయుచుఁ బ్రజ్ఞ గలవండితులౌ కతనన్ యథార్థ వి
ద్యారసికుల్ భవత్కృతుల నద్భుత రేమియొనర్ప నేర్తువో. ౨౬౩

ఉ॥ కావున నిత్య దేనియు వికారముఁ జెయ్యవలె మాని ప్రాజ్ఞులౌ
ధీవరు లాడువల్కులను దెల్లముగాఁ దలపోసి సత్యపుం
ద్రోవకు రమ్ము నీకు మసుద్రోహము నీ వొనరించియున్ బుజా
ఘా విలసిల్లు హేతువున శిష్యుఁడవై మంచియశమ్ము గల్గెడిన్. ౨౬౪

క॥ మనువచనమ్ములవిని తగ, మను మనువచనములనంగ మనువచనము లే
మనుకొంటివా? మనుమార్గమ్మనుమాన మ్మిడిగి పట్టు మది యఘ మడఁచున్

మ॥ *త్రివిధేయుండు త్రిలోకజేతయనుచున్ "త్రిష్వప్రమాద్యన్" మను
ప్రవచస్సారము తెల్పు నీవు కడగా వర్తిల్లుచున్నట్టి యా
పావనీయాగ్నుని గాంచఁ దొర్కి చయనుడ త్వా? మూడులోకమ్ములా
పావరంగమ్మున గెల్చుటన్ పృథయ ధర్మాధర్మ మర్మమ్ముల్. ౨౬౫

శా॥§ ఆజన్మంబు గురున్ భజించునెడ బ్రహ్మ ప్రాప్తి కర్హుండగా.
రాజించున్ స్మృతివాక్యముల్, మృషయ నమ్మోహత్వయమ్మాట నీ
కీజన్మమ్మునఁ గొంత సేవయును "హీహీహీ"లు "హూహూహూ"లు త
ద్రాజద్భ్రాహ్మ సమాజమాన్యతకుఁ బాత్రత్వమ్ముఁ జేకూర్చుటన్ ౨౬౬

---

*శ్లో॥ త ఏవహి త్రయో లోకా స్త ఏవ త్రయ ఆశ్రమాః, త ఏవహి త్రయో వేదా స్త ఏవోక్తా స్త్రయోఽగ్నయః,, ౨౩౦,, పితా వై గార్హపత్యోఽగ్ని, ర్మాతాగ్ని ర్దక్షిణ స్స్మృతః (గురు రాహవనీయస్తు) సాగ్ని త్రేతా గరీయసీ. ౨౩౧,, త్రిష్వప్రమాద్య న్నేతేషు త్రీన్ లోకాన్ విజయే ద్గృహీ॥,, ౨౩౨,, (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

(అభియుక్తోక్తి)

శ్లో॥ లజ్జాం మాతాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్॥

§శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యాతు మధ్యమం, గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మ లోకం సమశ్నుతే॥ ౨౩౩ శ్లో॥ ఆసమాప్తే శ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుం, సగచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతం॥ ౨౪౧॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

మ॥ *తనయార్జించిన క్షేత్ర ముఖ్య ధనముల్ దాతవ్యముల్ ముందు గాఁ
దనయాచార్యునకంచుఁ జెప్పు స్మృతి, తద్ధర్మంబు గన్పట్టె నో
తనయా! నీయెడ, నెట్టులన్న! వినుము దుర్ధర్మంబు త్వద్వృత్తమా
త్తనయా! నాయెడఁ దొల్తనీవు విని యుక్తంబౌట సూచించుటన్. ౨౬౮

శా॥ ¶ధాత్రిస్వార్జిత విత్త మందు నొకషష్ఠం బంశమున్ గైకొనం
బాత్రుండంట! గురుండు వింటివె! భవత్ప్రజ్ఞారితాచార్యుదు
శ్శాత్రుత్వాఖ్య ధనంబు సర్వమును నన్నత్యాతురత్వం బయ్యె నే
మాత్రంబో యిడ కంతయున్ బెరిమ నిమ్మాడ్కిన్ గురున్ జేర్తురే. ౨౬౯

మ॥ ‡శ్రుతిదూరంబయినన్ స్మృతిన్ దవిలె నెచ్చో నీస్థితుల్'' నిత్యము
ద్ధృత పాణిత్వము చెప్పెఁగా! మనువు, నీధీమత్త చే దాని నా
దృతమున్ జేసితి వగ్ర మందగపడన్ దేలుం జుమీ నీదును
ద్ధృత పాణిత్వఫలమ్ము, స్వార్థమతవర్తీ! నీకగున్ భద్రముల్. ౨౭౦

క॥ †భారతవచనమ్ముల మదిఁ, జేరుత మని బావనడుగు ధీరతులున్ న
ద్ధీరతులు నీదుపద్ధతి, ఘోరతరం బనెడిరీతి గొనకు మిఁకైనన్. ౨౭౧

---

*శ్లో॥ స్నాస్యంస్తు గురుణాజ్ఞప్త శ్శక్త్యా గుర్వర్థమాహరేత్, క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహ మాసనం, ధాన్యం శాకంచ వాసాంసి, గురవేప్రీతి మావహేత్॥ ౨౪౬ అత్రవ్యాఖ్యా॥ స్నాస్యన్నగ్గురుణాదత్తాజ్ఞో యథాశక్తి ధనినం యాచిత్వాఽపి ప్రతిగ్రహాదినాఽపి గురవేఽర్థ మాహృత్యాఽవశ్యందద్యాత్॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము.)

¶శ్లో॥ షడ్భాగం స్వార్జితం విత్తం కృత్వాఽనందాత్మకోనరః। ఏకంతు గురవేదద్యాత్....

‡శ్లో॥ నిత్య ముద్ధృత పాణిస్స్యాత్ స్వాధ్యాచారస్సుసంయతః, ఆస్యతామితి చోక్తస్సన్నా సీతాభిముఖంగురోః॥ ౧౯౩ (మను- ౨, అ.

(భారతాదిపర్వమునుండి)

†కశ్చిదృషి ర్ధౌమ్యోనామ...తస్య శిష్యాస్త్రయో బభూవు రుపమన్యు రారుణిర్వేదశ్చేతి, సఏకంశిష్యమారుణింపాంచాల్యం ప్రేషయామాస "గచ్ఛ కేదారఖండం బధానేతి,...యస్మాచ్చ త్వయా మద్వచనమనుష్ఠితం, తస్మాచ్ఛ్రేయోఽవాప్స్యసి,

క॥ గురుశరవహ్నికిఁ గృష్ణుం, డఱిముఱి భీతిపడు ధర్మజాదుల సత్య
స్థిరుల ససత్యంపుమహా, దురితమ్మునఁ ద్రోచె నెఱుఁగుదో యెఱుఁగవొకో.
క॥ నిజమైనతిట్లు తిట్టుము, గజగజ నీకేల? లేని కార్లనకుము భూ
ప్రజలు సహింపరు లోలో, * స్వజనంబేనియును దప్పు సైఁపదెఱుఁగుమీ.

---

సర్వ ఏవ తే వేదాః ప్రతిభాస్యంతి సర్వాణి చ ధర్మశాస్త్రాణీతి,... తంచోపాధ్యాయః ప్రేషయమాస" వత్సోపమన్యో గారక్షస్వేతి,... మయ్యనివేద్య భైక్ష్యం నోపయోక్తవ్యమితి... భో ఉపమన్యో క్వాఽసివత్సేహీతి. స ఉపాధ్యాయవచనం శ్రుత్వా ప్రత్యువాచ,... కూపేపతితోఽహమితి, తముపాధ్యాయః ప్రత్యువాచ కథం త్వ మస్మిన్ కూపే పతిత ఇతి, సఉపాధ్యాయం ప్రత్యువాచ. అర్కపత్రాణి భక్షిత్వాఽంధో భూతోఽ స్మ్యతః కూపే పతిత ఇతి, తముపాధ్యాయః ప్రత్యువాచ అశ్వినౌ స్తుహి,... త్వాం చక్షుష్మంతం కర్తారా వితి,... అశ్వినౌ స్తోతుముపచక్రమే,... అశ్వినావాజగ్మతురాహతుశ్చైనం, ప్రీతౌ స్వ ఏష తేఽ పూపోఽశానైనమితి,... నత్వహమే తమపూపముపయోక్తు ముత్సహే గురవేఽ నివేద్యేతి,... తమశ్వినావాహతుః, ప్రీతౌ స్వస్తవానయా గురుభక్త్యా,... చక్షుష్మాంశ్చ భవిష్యసి శ్రేయశ్చావాప్స్యసీతి,... లబ్ధచక్షుః... ఉపాధ్యాయ మభ్యవాదయత్,... ఏషాతస్యాఽపి పరీక్షోపమన్యోః, అథాపరశ్శిష్యః... వేదో నామ... గౌరివనిత్యం గురుకార్యేషు ధూర్షు నియుజ్యమానః, తస్య మహతా కాలేన గురుః పరితోషం జగామ. తత్పరితోషాచ్ఛ్రేయ స్సర్వజ్ఞతాం చావాప, ఏషా తస్యాఽపి పరీక్షా వేదస్య. ......

(విస్తరస్తుతత్రైవద్రష్టవ్యః)

రాజమండ్రి.
ది 28-8-18.

*...తమరు కాకరపర్రు వెళ్లినప్పుడు "లోకములోని కవులందరు నా బంధ్యము లోనివారు" అని అన్నందుచే యీ అల్లరి జరిగినదనిన్ని పిమ్మట తప్పంతయు ను కాకరపర్తివారిదే అనిన్ని శ్రీ ఆ॥ వ్యాసలింగశాస్త్రులవారు నాతో చెప్పినారు. ఇంకా కొన్ని సంగతు లున్నవి కాని విస్తరించుటకు స్థలము లేక వ్రాయలేదు, ...రామకృష్ణులు ముందు భారతము ప్రచురించెదరట. వారు యెన్ని వ్రాసినను గురుద్రోహమును బలపరచేదే అని శ్రీ, ఆ॥ వ్యాసలింగశాస్త్రిగారు అన్నారు...

చె. కొండయ్యప్రభాలు.

క॥ చదువెఱుఁగఁడనియుఁ గంతము, మృదువైనది గాదటనియు నేరికి విద్వత్
గుదిరి వచింపఁడనియు నా?, పదరి జగము మెచ్చుగోరు పద్ధతిచెపుమా.

క॥ నారొద్దఁ జదివినదెయని, కోయిల నీవాయసంబు గూయుట తప్పా
నే? యరయుమయ్య బావమొ, వ్రాయక వలె, నీకుఁ జేయు రాదిటు వ్రాయన్.

క॥ ఇరువురచేవ్రా ళ్లుండుట, యరసియు నీ కిట్లు వ్రాయు టది రావనియే
పొరఁబడితిఁ గొంతకాలము, పరమాప్తుఁడు రామమూర్తి పలికెడిదనుకన్.

చ॥ తతమతి నీ కతండు పెదతల్లికుమారుఁడు నాకు మిత్రుఁడు
న్నతుఁ డన్యతం బతండు జననంబును బొందిన వంగదప్తా యా
కృతయుగ మాదిగా నెఱుఁగ దిప్పుడు నీకయి నేర్పఁ బోదు సూ
నృతవచనుండు నీకతననే విని నాకు వచించె నర్భకా. ౨౭౭

చ॥ కుతుకముతో నొకానొకటఁ "గోకిల కాకము" నాకవిత్వ మం
చతనికిఁ జెప్పినాఁడవఁట? యయ్యది జ్ఞప్తికిఁ దెచ్చికొమ్ము త
త్రితకలిమిన్ వచింపఁడు బుధుం డతఁడేదా ప్రసంగమందు సం
గతమగుటన్ వచించె నడుగం దగునందియ ముండెనేనియున్ ౨౭౮

చ॥ అనయుఁడవై వృథాగ నెపు డాఱడి వ్రాఁతలు వ్రాయుచున్ నిజం
బు నడఁచి నేఁటికేనియు సుబుద్ధివి కాక పరాక్రమించు ని
న్నును సుజనుల్ బొనర్చుట కనుంగుఁ జెలిన్ ఘనరామమూర్తి గా
రిని నొక సాక్షిఁ జేసితి నెఱింగి యతండు క్షమింప కుండునే. ౨౭౯

ఉ॥ అందఱు నాకు బందుగులె యంచు లిఖించెద వింతసాహసం
బెందుకు? దూరగుల్ బలెనె యుంజర కాఁకరవల్లు వాసులున్
బొందఁబడంగలారె యిటు బొంకఁగ నేటికి? రామమూర్తి నే
ముందువొ చెప్పుమా యకట? యాతఁడు నాపెదతల్లి పుత్రుఁడే. ౨౮౦

శా॥ చాడీలన్ వచియించువాఁడొ? జడుఁడో? ఛండాలపుంబుంత లే
నాఁడున్ ద్రొక్కినవాఁడొ? త్రొక్కఁగలఁడో? నాబోఁటి లెక్కేమి హే
పోపిడల్ నెత్తిని బెట్టుకోఁదగిన సత్పుణ్యుండు గణ్యుండు తా
నాడంబోయెనొకో? యసత్యము కుమారా? నిన్ను వంచింపఁగన్ ౨౮౧

శా॥ ఆడుంబోని యమృతంబు నీకొఱకు వ్యాసాకొండి యొస్తేని, పావి
ద్రాడంగాక మహాకవి చోఁ బాడమి కాయాకొండిచేఁ బ్రల్లదం
బాడింపంగలదే యిఁక చూచెదను గా కంచుఁ బరీక్షార్థమై
నేఁ డిచ్చో సుకసాక్షిగా నతని వర్ణింపఁ బ్రసక్తించెఁ జూ. ౧౮౨

ఉ॥ ఘనుఁడల రామమూర్తి యెటుగా లిఖియించిన నెందుఁజేరునో ?
తనలిపి యంచుఁ గొంకుఁబామి తథ్యమెఱింగియుఁ, బెద్దతల్లికిం
దనయుఁడె వేఁటా కండిపుడు దా ధవళాద్రి వసించు నాతఁడుఁ
ఘనుఁడు తదంబయు న్మిగులఁ గందురు నేఁటికి నన్నుఁ జేర్మితోఁ. ౧౮౩

†క॥ కృతమీవుమఱచితివి నీ, కతనంగదె వారు నాకుఁ గడుఁ గూర్తురు నీ
కతి శత్రుఁడు వారలకే, గతిఁ బ్రేమాన్పదుఁడో తెలుపఁగాఁగలవె సుతా.

క॥ గురుఁగాక మగానుడివిన, దురితపు వ్యాసమ్ము గాంచి దుఃఖింపక యె
వ్వరో మెచ్చిరనియు వ్రాసెద, పరరే యటువంటిరోగ్య లవనింగలరే.

‡క॥ శత్రులుమిత్రులు నైరము,వుత్రీ తలయాఁచిరనుచుఁ జూంగెఁగదా మీ
తత్రిక యాఁచుటకర్థ ము,పాత్రవ్యాస మని చేయుటని గాదుగదా ? ౧౮౬

క॥ నీకవితాప్రాశస్త్య, శ్రీకతనఁ గలుగు యశము చెందెడి నను నీ
కోరి కృతముమఱచు పాతక,మే కడకుఁ మిగులు పారమిదియె కుమారా

క॥ ఎందుకుఁ జెంచెద వఘమిది,యందఱకు న్నిజము దెలిసె నాఁగునె కస్తూ
రిందాఁచినఁ బరిమళమది,బొంపఁబడకు నిజమునుడివి పొందుము శుభముల్.

## (10) మంగళపర్వము.

ఉ॥ తిరుపతి నాకు నింతటి విధేయుఁడు శిష్యుఁడు గల్గె వాని నం
చరణము లీశ్వరుఁ డెగడు సాహసమూనెడి, పట్టివానికిఁ

---

ధవళేశ్వరము. 26-8-13.

†...శ్రీ మానాన్నగారు శ్రీ మాయమ్మగారు, సదా మచ్ఛ్రేయోభివృద్ధిని గోరుచున్నవారలు. శా॥ నారాయణమూర్తి.

(కవితనుండి.)

‡కోకిలకాకము,ఇదికోకిలమును గాకమునుగూర్చిన యొక చిత్రకథ,శత్రులు మిత్రులుగూడఁ దలయాఁచిన పద్యములు.

గురువన నెంతయి తాదృశుని గొండొక యోగ్యునిఁ జేయ వేంకటే
శ్వరుఁ డొనరించె ధర్మపుఁ బ్రసంగ మొనంగు ప్రసంగసంగతిన్ ౨౮౯

చ॥ తిరుపతి వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టు వానికిం
దిరుపతియె వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టుటెంతయో యే
మఱఁజన దైననున్ మనకు మంచికిఁ ద్రివ్వత్రయంగ మేదిరా
జరుపుట యొప్పు వానికిది సాయముఁ జేసినఁ జేయకుండినన్ ౨౯౦

చ॥ హితము వచింపఁ డామొనఁగు నెవ్వఁడు వాఁడెవఁడున్ వినండ భా
రతమున నేమి తక్కిన పురాణములందున నేమి యెవ్వఁడే
హితముగ్రహించెనే యట్లని మఱెవ్వఁడు చెప్పుటమానెనే చెప్పు టే
చతురునికోయగున్ గణన నల్ప కృతార్థుఁడు వేఱొకండగున్ ౨౯౧

ఉ॥ కావున నేరొనర్చినను గష్టము లోకముకోనమే యశ
శ్శ్రీవిమలీకృతోజ్జ్వలదశేష విశేషదిగంతరాళు లా
ధీవరులెల్ల లోకమునఁ దేలవలెన్ బరిశుద్ధలోకసం
భావితులే సుమీ జగతి భవ్యులు సేవ్యులు కావ్యభావ్యులున్. ౨౯౨

ఉ॥ లోకము మెచ్చు గాంచు నతిలోకుని యాదవపట్టభద్రు దు
ష్ప్రకుఁడు దుర్జయుండు శిశుపాలుఁడు పట్టుకతిట్టె దానిచే
నాకతి వేల్పుపూజనము లద్దెనె? సాక్షికలోక మెన్నఁడున్
లోకములోనఁ జేర దరిలోకపు శోకము కీర్తికే యగున్. ౨౯౩

సీ॥ ఖరముఖాసురకోటి కపాకపౌరుషటిలేక రామకీర్తికి నట్టిరాణ యెట్లు?
శిశుపాలదుర్విపాత్పశువన్పళలు లేక కృష్ణకీర్తికి నట్టి కెలన మెట్లు?
కనకకశిపుదుష్టకష్టచేష్టలులేక నరసింహుకీర్తి కాగరిమ యెట్లు?
కులనృపాలకహాలాహలకాళాకాళి లేక కల్కికీర్తికి నట్టి కలిమి యెట్లు?
తే॥గీ॥ ఎంతవాఁడేని విమతులొక్కింతసాయ । మాదరింపక పేరెక్కఁడట్టులగుట
నిరతసత్కీర్తి దాతల నిర్గుణస్వరూపుల నుతించి కీర్తిఁ బ్రేరేపవలయు.

మ॥ నుతియింతున్ మన రామకృష్ణకవులన్ సున్నాస్త్ర్యధర్మైక స
ద్గతులన్ సూనృతవాగరాతుల, వృథాదంభానుఘోషానృత
శ్రితులన్ దాదృశకొత్రవుంగవుల, నశ్లీలాపవాదప్రద
ప్రతిభాదూతల వారివీరిహితులన్ బ్రాంచద్యశోదాతలన్. ౨౯౪

మ॥ దయనై కొల్చుటకన్నఁ దిట్టుటయ మేల్ దైవాదులన్, బూర్వమే
జయుఁడున్ శ్రీ విజయుండు శాపహతులై జనించి రీత్రోవ, త
ద్దయు సౌకర్యము దీనియం దగపడున్ దైన్యంబు గన్పట్ట దా
శ్రయణక్లేశము నున్న తుల్యము ఫలైశ్వర్యంబు రాజించినన్.

మ॥ కలికిన్ మంగళమస్తు దానికి సిరిన్ గల్పింప యత్నించు ధీ
రులకున్ మంగళమస్తు నిస్తులవచోరూఢిన్ గలిన్ ద్రుంచునా
ర్యులకున్ మంగళమస్తు వేదమత శాస్త్రోక్తార్యధర్మైకవ
ర్తులకున్ మంగళమస్తు గీరతవచోదుగ్ధాబ్ధికిన్ మంగళమ్

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు
గీరతామ్నాయమ్మునందు గురుదక్షిణ
యను ద్వితీయభాగము,
సంపూర్ణము.

